ప్రథమ ముద్రణ: నవంబరు 1959



వెల: 60 నయా పైసలు




ముఖ చిత్రాలంకరణ:

శ్రీ ఎస్. ఎమ్. కేతా

ముద్రణ:

క్రాంతి ప్రెస్,

12, ఫ్రాన్సిస్ జోసఫ్ స్ట్రీట్, మద్రాసు - 1.

మీనభామిని వాయుగుండంలో చిక్కుకున్న జయశ్రీని కాపాడి సముద్ర గర్భంలోకి తీసుకు పోతూండగా కళ్ళారా చూసిన కుంభరాక్షసుడు ఏమి చేయడానికీ తోచక క్షణకాలం గగన మార్గంలో నిశ్చేష్టుడై నిలుచుండి పోయాడు. అయితే మరు క్షణంలోనే తాను కూడా రోషావేశాలతో సముద్రంలో మునిగి మీనభామినిని వెన్నాడ సాగాడు...

జయశ్రీని బలంగా పట్టుకుని అతి వేగంగా భూమట్టానికి దిగిపోతున్న మీనభామిని ఒకసారి పైకి చూసింది. ఆమె చూపు తనను వెంబడిస్తూ వస్తున్న కుంభరాక్షసుని మీద పడింది.

అదే సమయంలో కుంభరాక్షసుడు మీనాకారాన్ని ధరించి అమిత వేగంతో నీటిని చీల్చుకుంటూ ముందుకు రావడం ప్రారంభించాడు. అది గమనించిన మీనభామిని కూడా మొదటి కంటె చురుగ్గా క్రిందికి దిగజార సాగింది.

మీనభామినిని సమీపించి ఏదో విధంగా జయశ్రీని విడిపించుకుని తీసుకుపోవాలనే దృఢసంకల్పంతో మత్స్యరూపంలో నున్న కుంభరాక్షసుడు దగ్గరకు వస్తూంటే,—ఎలాంటి పరిస్థితిలోను జయశ్రీని అతనికి అందనీయకూడదన్న నిశ్చితాభిప్రాయంతో మీనభామిని నేలమట్టానికి జారిపోతూంది!

అగాధ సాగరంలో అడుక్కి దిగిపోతూన్న ఆ యిద్దరూ వేరు వేరు భావాలతో ఒకరిని చూసి మరొకరు వేగాన్ని రెట్టించుకుంటూ నీటి అడుక్కి చొచ్చుకు పోసాగారు.

కొన్ని క్షణాలు గడిచాయి. కుంభరాక్షసుడు ఎంత ప్రయత్నించినా మీనభామినిని సమీపించలేక పోతున్నాడు. మరి కొన్ని క్షణాలు అలాగే గడిస్తే జయశ్రీ యిక తనకు దక్కదని అతనికి బాగా తెలుసు. తొందరగా తాను మీనభామినిని అడ్డగించక పోతే ఆమె తన జలాంతర్భవనంలోకి వెళ్ళి పోతుందని, అప్పుడిక తను చేయగలిగిందిగా లేదని కుంభ రాక్షసుడు భావించాడు. అతనికా భావన కలగడంతోనే బలాన్ని కూడగట్టుకుని అతి చురుగ్గా క్రిందికి దిగుతూ, తన మంత్ర ప్రభావంతో మీనభామిని మార్గానికి మెరుపు తీగలను అడ్డు వేశాడు.

జయశ్రీని కుంభరాక్షసునికి దక్కనీయకూడదనే ఉద్దేశంతో వెనుక ముందులు చూడకుండా అమిత వేగంతో క్రిందకు పోతూన్న మీనభామిని తలవని తలంపుగా మెరుపు తీగల మధ్య చిక్కుకుంది. మాంత్రిక తీగల తాకిడివల్ల ఆమె జవసత్వాలు సన్నగిల్లాయి. అవయవాలు బలహీనమయ్యాయి. ఎంత ప్రయత్నించినా యిహ క్రిందకు దిగజారలేక పోయింది.

...ఆమె పరిస్థితిని అర్థం చేసుకుంది. అదంతా కుంభరాక్షసుని ప్రభావమేనని గుర్తించింది. ఒక్కసారి తీవ్రంగా పైకి చూసింది.

కుంభరాక్షసుడు అమితవేగంతో ఆమెను సమీపిస్తున్నాడు.

మీనభామిని తొందరగా క్రిందకు చూసింది. తన భవనం చాలా సమీపంలో వుండడం గమనించింది. తీగల అడ్డు తొలగిపోతే రెప్పపాటు కాలంలో భవనాన్ని చేరుకోగలనని భావించింది. భవనంలో ప్రవేశిస్తే కుంభరాక్షసుడు యిహ ఎలాంటి హానీ కలిగించలేడని తలపోసింది. ఆలశ్యం చేయ

రయ్యింది. అది చూసిన కుంభరాక్షసుడు అమితవేగంతో ఆమెను సమీపించి తన వెన్నంటి వున్న ఖడ్గంతో గండు మీనంగా మారిన ఆమె శరీరాన్ని ముక్క ముక్కలుగా చేయాలని సంకల్పించాడు. కాని మీనభామిని అతనికా అవకాశాన్ని కలగనీయకుండా అతి చురుగ్గా మరొక ప్రక్కకు వెళ్ళి నిలచింది.

దానితో కుంభరాక్షసుని ప్రయత్నం విఫలమైంది. తన సంకల్పం నెరవేరక పోవడంతో కుంభరాక్షసుడు తిరిగి ఉద్రేకంగా మీనభామినిని సమీపించ సాగాడు.

ఈ మారు మీనభామిని తప్పించుకోవాలని ప్రయత్నించకుండా అతన్నెదిరించడానికి సిద్ధపడింది. అయితే ఆమె అతనితో పోరాడ్డానికి జయశ్రీ అడ్డొచ్చింది. గండుమీనంగా మారిన మీనభామిని అంతవరకు జయశ్రీని నోట కరచి పట్టుకుని వుంచింది. అందుచేత, ఆమె నలా నోట కరచివుంచి, కుంభరాక్షసునితో పోరాడ్డం సాధ్యంకాదని భావించింది మీనభామిని. అంతేకాకుండా పోరాట సమయంలో జయశ్రీకి కూడా గాయాలు కలుగవచ్చునని అనుమానించింది. ఆమె కట్టి భావన కలగడంతో కొంతకాలం ఆలోచనలో మునిగి పోయింది.

ఆమె ఏమరుపాటుగా వుండడం గమనించిన కుంభరాక్షసుడు చురుగ్గా వెనుకకుచేరి, తన శరీరంమీది ఖడ్గంతో ఆమె దేహాన్ని తీవ్రంగా గాయపరచాడు. అప్పుడు కలిగిన బాధను సహించలేక మీనభామిని కాసేపు గిలగిల కొట్టుకుంది. ఆ సమయంలో అనుకోకుండా ఆమె తన నోట కరచి పట్టుకున్న జయశ్రీని నీట విడిచింది...

చైతన్యాన్ని కోల్పోయివున్న జయశ్రీ దేహం చురుగ్గా నీటి అడుక్కి దిగబడసాగింది. మీనభామిని, కుంభరాక్షసుడు- యిద్దరూ క్రిందకు జారిపోతూన్న జయశ్రీని ఒకేమారు

చూశారు. మరుక్షణంలో యిద్దరూ రక్తారుణ నేత్రాలతో ఒకరినొకరు తీవ్రంగా చూసుకున్నారు.

ఖడ్గ మీనాకారంలో వున్న కుంభరాక్షసుడు మీనభామిని ఉద్దేశించి "చాలా అవివేకంగా ప్రవర్తించావు. ఆమెను నాకు కాకుండా చేసి జలరాశికి అప్పగించావు" అన్నాడు. అతని నోటినుంచి వచ్చిన ప్రతి అక్షరం ఒక్కొక్క ఉరుములా బయట పడింది. ఆ శబ్దానికి కంపించిన సముద్రజలం చీలికలై, వాటికి మార్గాన్నిచ్చింది. అతని నోటినుంచి వచ్చిన మాటలు ఏ అడ్డు, ఆటంకం లేకుండా వెళ్ళి మీనభామిని చెవిని తాకాయి.

కందుమీనం రూపంలో వున్న మీనభామిని ఆ మాట విని మండిపడింది. "కుంభా! అధిక ప్రసంగాన్ని విడిచిపెట్టు. ఎలా వచ్చినవాడవు అలా వెళ్ళిపో" అంది తీవ్రంగా. ఆమె అలా అంటున్నంతసేపూ పిడుగులు వర్షిస్తూన్నట్టయింది. ఆమె అన్నమాటలు నీటిని చీల్చుకుంటూ వచ్చి కుంభరాక్షసుని చెవిలో ప్రతిధ్వనించాయి.

"మీనా! నీకు అంత్యకాలం సమీపించింది. అందుకే నా మార్గానికి అడ్డువచ్చావు. నీకిప్పుడే తగిన ప్రాయశ్చిత్తం చేస్తాను. అంతవరకు నీ అహం తగ్గేలా లేదు" అన్నాడు కుంభరాక్షసుడు.

అతనలా అనడంతో మీనభామిని శరీరం లోపలి రక్తం ఉడుకెత్తిపోయింది. ఆమె తనకు కలిగిన గాయంవైపు ఒక సారి చూసుకుని "కుంభా! తగునని తయారై నాచేత ఒక సారి పరాభవించబడ్డావు. అంతటితో బుద్ధి తెచ్చుకోనక తిరిగి కయ్యానికి కాలుదువ్వుతున్నావు. ఇప్పటికైనా మించి పోయింది లేదు. తెలివి తెచ్చుకుని యిక్కడినుంచి తొలగి పో" అంది.

"అది నా బొందిలో ప్రాణం వుండగా జరగదు. వెనక

టిలా నీ చేత పరాభవించబడేంత బలహీనుడ్ని కానిప్పుడు. పరాభవానికి ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాను. నిన్ను జయించాలనే సంకల్పంతో కొన్ని వందల సంవత్సరాలు ఘోర దీక్షలో మునిగి పోయాను. అందుకు ప్రతిఫలంగా నాలుగు అష్ట భూతాలు నా ఆధీనంలోకి వచ్చాయి. సింహ పిశాచం నా భవనంలో పెంపుడు జంతువులా తిరుగుతోంది. సర్పప్రేతాలు నా యింట లెక్కలేకుండా పడున్నాయి. తెలుసా... నా సాధన ముందు నీ శక్తి యుక్తులిక ఏమీ పని చెయ్యవు. నా వశంలో నున్న భూతప్రేత పిశాచాలను ఒక్క సారిగా ప్రేరేపిస్తే నువ్వు నామరూపాలు లేకుండా పోతావు. యిప్పుడే నీకు నా శక్తిని చూపించి వుండేవాడ్ని. కాని, అందు కిది సమయం కాదు. ముందు నా ప్రేమ దేవతను కాపాడుకొని ఆ తర్వాత నీ సంగతి చూస్తాను." అంటూ కుంభరాక్షసుడు జయశ్రీ వైపు దిగజారడం ప్రారంభించాడు.

మీనభామిని కూడా అతనితోపాటు క్రిందికి జారుతూ "కుంభా! నీ సంగతి నాకు బాగా తెలుసు. నీకు కలిగిన అవ మానానికి ప్రతీకారం తీర్చుకోడానికి అన్ని రకాలుగాను ప్రయత్నిస్తావని నే నెరుగుదును. అందుకే ఆనాటి నుంచి నిన్నొక కంట కనిపెడుతూనే వున్నాను... ఊఁ! కుంభా! జయశ్రీ నీ భవనంలోంచి బయటకు వచ్చేస్తాం లేఁ. నీ అష్ట భూతాలు ఆమెను ఆపుచేయు లేక పోయాయేం! ఆమె కాళ్ళకు చుట్టుకున్న సర్పప్రేతాలు ఒక్క విదలింపుతో తూలి దూరంగా పడిపోయాయేం! సింహ పిశాచాన్ని నీ ఆధీనంలో పెట్టుకోగలిగావని గర్వంగా చెప్తున్నావే! - అంతటి మహా పిశాచం ఆమె మార్గానికి అడ్డురాలేక పోయిందేం!! కుంభా! నీతో పాటు నేనూ అన్ని విద్యల్లోను ఆరితేరాను. ప్రత్యక్ష దర్పణంలో నువ్వేమి చేస్తున్నదీ ఎప్పటి కప్పుడు గమనిస్తూనే వున్నాను. జయశ్రీని నువ్వు అపహరించుకు వచ్చిననాడే ఆమెకు

రక్షణగా కొన్ని అస్పృశ్యశక్తుల్ని నీ భవనం వాకిట కాపలా పెట్టాను. కామాంధుడవైన నువ్వా విషయాన్ని గుర్తించలేక పోయావు. అంతేకాదు, నా మాంత్రిక గ్రహాంతరం నుంచి వచ్చిన గాలి ఒత్తిడివల్ల వాయుమండలంలోకి చేరిపోయిన జయశ్రీ యింత దూరం ఎలా వచ్చిందో తెలుసా అదంతా నా ప్రభావమే! నా ప్రేరేపణలో నాకు సేవకులుగా నిలిచిన అదృశ్య శక్తులే ఆమెను నీకు అందకుండా చేసి నా సమీపానికి చేర్చాయి. ఇంకెంతసేపు విర్రవీగుతుంటే నువ్వు క్షణంలో అంతమై పోతావు. ఆజ్ఞాపించడం ఆలస్యంగా నా వశంలోనున్న అదృశ్య శక్తులు యీ నీటిలోనే నీకు సమాధికడతాయి..." అంది తీవ్రంగా.

కుంభరాక్షసుడు ఆమె మాటలు విని అదిరిపోయాడు. క్రిందకు జారుతున్న కాళ్లు కొంతకాలం నిలుచుండిపోయాయి.

అది గమనించిన మీనభామిని "కుంభా! యిప్పటికైనా నా శక్తిని గుర్తిస్తే వెనక్కి తిరిగి వెళ్లిపో" అంది మళ్ళీ.

కుంభరాక్షసుడు ఆమె కెలాంటి సమాధానం చెప్పలేదు. కొంతకాలం ఆలోచించి, ధ్యానముద్రలో కళ్లుమూసుకున్నాడు. మరుక్షణంలో అతను మనోవేగంతో జయశ్రీ దగ్గరకు ప్రయాణించ సాగాడు.

అతని వృత్తాంతాన్ని గ్రహించి- మత్స్యరూపాన్ని దాల్చిన మీనభామిని ఉన్నచోటనే ఉండి, పకపక నవ్వడం ప్రారంభించింది. ఆమె నవ్వుకు చుట్టూవున్న సముద్రజలంలో కల్లోలం బయలుదేరింది. ఆ కల్లోల ప్రాంతంలో విహరిస్తున్న జలజంతువులన్నీ దూరదూరంగా కొట్టుకుపోసాగాయి. వాటితోపాటు జయశ్రీని సమీపిస్తున్న కుంభరాక్షసుడు కూడా ఒక మూలకు విసిరి వేయబడ్డాడు. ఆ సమయంలో సుడిగుండంలో పడ్డ గడ్డి పూచలా మెలితిరిగిపోయిన అతన్నే చూస్తూ, మీనభామిని యింకా

కొంచెం గట్టిగా నవ్వుతూ అంతలోనే జయశ్రీ వైపు చూసి కంపించి పోయింది.

నిర్జీవంగా క్రిందకు దిగిపోతూన్న జయశ్రీని నాలుగు వైపుల నుంచి నాలుగు అస్థిపంజరాలు ఆక్రమించుకుంటూ వస్తున్నాయి. వందలకొద్దీ సర్పాలు ఉచ్చులా ఒకదాన్నొకటి పెనవేసుకొని జయశ్రీ దేహాన్ని తమ జాలంలో చిక్కించుకోడానికి ముందుకు వస్తున్నాయి.

ఆ దృశ్యాన్ని చూసిన మీనభామిని అందుకు కారణాన్ని వెంటనే అవగాహన చేసుకుంది. అస్థిపంజరాకారాల్లోను, సర్పరూపాల్లోను కనబడుతూన్నది కుంభరాక్షసుని అధీనంలో వున్న భయంకర భూతాలని, అవి అతని ప్రేరేపణవల్లే జయశ్రీని ఆక్రమించుకు వస్తున్నాయని తెలుసుకొంది. ఆలశ్యం చేస్తే జయశ్రీ తిరిగి ఆపదలో చిక్కుకుంటుందని భావించింది.

వెంటనే ఆమె నిజరూపాన్ని ధరించి జయశ్రీని సమీపించాలనుకునేంతలో సింహపిశాచం అడ్డుగా వచ్చి ఆమె మీదకు ఉరకడానికి సిద్ధపడింది. తన మార్గానికి నిరోధంగా నిలచి ముందుకు వస్తున్న సింహపిశాచాన్ని చూడ్డంతో మీనభామిని ఆవేశంతో ఉగ్రరూపాన్ని దాల్చింది. భయంకరంగా అట్టహాసం చేసి రెండు చేతులను నోటి దగ్గర పెట్టుకుంది. అంతలోనే ఆమె నోటినుంచి వచ్చిన 'భమ్ ..భమ్...భమ్... భమ్...' అనే శబ్దంతో ఆ ప్రాంతమంతా మారుమ్రోగింది. కన్ను మూసి తెరచేంతలో ఆ ప్రదేశమంతా యుద్ధరంగంగా మారిపోయింది.

ఆ అనంతజలరాశిలో భూత, ప్రేత, పిశాచాలు విలయ తాండవం చేయసాగాయి! "శత్రువులను ప్రాణాలతో పోనీయకండి" అంది మీనభామిని తన బలగాన్ని ఉద్దేశించి.

కుంభరాక్షసుడు కూడా తన పక్షాన్ని హెచ్చరించాడు.

రెండువైపుల శక్తులు ఘోరంగా పోరాడసాగాయి. కుంభ

రాక్షసుడు, మీనభామిని పోరాటాన్ని గమనిస్తూ అవసరాన్ని బట్టి తమ తమ శక్తులకు హెచ్చరికలు చేయడం మొదలు పెట్టారు.

పోరు భీకరరూపాన్ని దాల్చింది. కుంభరాక్షసుని సింహ పిశాచానికి మీనభామిని సింహపిశాచం ఎదురు నిలిచింది. అస్థి పంజరంతో అస్థిపంజరాలు పోరాడుతున్నాయి. సర్ప ప్రేతాలతో సర్పప్రేతాలే తలపడ్డాయి. ఆ మహా భయంకర పోరాటంలో యిరుపక్షాలు తీవ్రంగా గాయపడుతున్నాయి. వాటి శరీరాల్లోంచి కారుతూన్న రక్తంతో సముద్రజలం ఎరుపెక్కిపోతూంది.

కొన్నిపటికి పోరాటంలో మార్పు వచ్చింది.కుంభరాక్షసుని పక్షం క్రమక్రమంగా బలహీనతకు గురయింది. మీనభామిని శక్తులు విజృంభించి కుంభరాక్షసుని బలగాన్ని తరిమి తరిమి కొట్టసాగాయి.

అయినా కుంభరాక్షసుని పక్షం కూడా ఓటమిని అంగీకరించకుండా శక్తి కొద్దీ పోరాడుతూనేవుంది. అప్పుడప్పుడు కుంభరాక్షసుడు ధ్యాననిమగ్నుడై తన పక్షానికి కావలసిన బలాన్ని చేకూరుస్తున్నాడు. కాని, ఎంత ప్రయత్నించినా మీనభామిని పక్షం చెక్కుచెదరకుండా రెట్టించిన ఉత్సాహంతో పోరాడుతూండటం గమనించి అతను ఆందోళన చెందకుండా వుండలేకపోయాడు. అంతలోనే తన అస్థిభూతా న్నొకదాన్ని శత్రుభూతం అమాంతంగా సందిట నిముడ్చుకుని కీలుకీలు చొప్పున వూడదీసి, చూస్తూండగానే నాశనం చేయ డంతో అతని ఆందోళన భయంగా మారిపోయింది. తొట్రుపాటుతో అతను యుద్ధరంగాన్నంతా ఒకసారి కలయ చూశాడు. ఎటు చూసినా అతని బలగమే నాశనమై పోతూంది. మీనభామిని శక్తులు వీరవిహారం చేస్తున్నాయి. కొన్నిపట్లో తన బలగం ఆ ప్రాంతాన్ని విడిచిపెట్టి పారి

పోవడమో, లేక ప్రాణాలను కోల్పోవడమో తప్పదని అతను భావించాడు. అంతలో అతని చూపు అప్రయత్నంగా మీనభామిని మీద పడింది.

మీనభామిని విజయవిహారం చేస్తున్న తన పక్షాన్ని చూసి తన్మయత్వంతో ఊగిపోయింది. ఒళ్లు తెలియని ఆనందంతో యుద్ధరంగాన్ని వీక్షిస్తోంది. ఆమెకు ఆ పోరాటంతో ఏమీ సంబంధం లేనట్టు-కేవలం ప్రేక్షకురాలిలా నిలబడి పోరాట పద్ధతులను తిలకిస్తోంది.

భయాందోళనలతో కృంగిపోతూన్న కుంభరాక్షసునికి మీనభామినిని చూడగానే క్రొత్త యోచన కలిగింది. దానితో అతని మనస్సులో ఆశారేఖలు ఉదయించాయి. అతను ఉత్సాహంగా మళ్లీ యుద్ధరంగంవైపు చూశాడు. తన పక్షంలోని శక్తులు క్రమక్రమంగా ప్రాణాలను కోల్పోతున్నాయి. అయినా చివరి క్షణంవరకు అవి పోరాడుతూనే వున్నాయి. క్షణక్షణానికి తన శక్తుల సంఖ్య తగ్గుముఖం పడుతూండటం చూసిన కుంభరాక్షసుడు ఆలస్యం చేస్తే తన ప్రయత్నం నెరవేరదని తలపోశాడు. యుద్ధం ముగియకముందే, మీనభామిని తన్మయత్వంలోంచి తేరుకోనకముందే యుద్ధరంగానికి అతి దూరంలో—నీటి అడుక్కి పోతూన్న జయశ్రీని ఎత్తుకుపోవాలనుకున్నాడు.

తనకా ఆలోచన కలగడం తడవుగా కుంభరాక్షసుడు మనోవేగంతో జయశ్రీని సమీపించాడు. అక్కడనుంచే అతనొకసారి మీనభామినివైపు చూశాడు.

మీనభామిని చూపులు యింకా యుద్ధరంగం మీదే వున్నాయి. తన పక్షపు శక్తులు కుంభరాక్షసుని శక్తుల్ని దునుమాడుతూండడం గమనించి ఆ సమయంలో 'ఓహో' 'బలే' 'బాగా బుద్ధిచెప్తున్నారు' అంటూంది మీనభామిని.

ఆ యవకాశాన్ని జారబెట్టకూడదనుకున్న కుంభరాక్షసుడు

అమాంతంగా జయశ్రీ శరీరం మీదకు తన చేతులను పోనిచ్చాడు. కాని, అదే సమయంలో గుండ్రని గోళం ఒకటి అతివేగంగా అక్కడకు వచ్చి, లిప్తకాలంలో రెండు భాగాలుగా చీలి కొద్దిగా తెరచుకుని జయశ్రీని తనలోపలికి లాక్కుని అంతలోనే అదృశ్యమైపోయింది!

# 32

జయశ్రీని లోపల యిముడ్చుకున్న గోళం చూస్తుండగానే మాయమైపోవడంతో కుంభరాక్షసుడు కంపించిపోయాడు. ఆ గోళం ఎక్కడనుండి వచ్చిందో, ఎటు పోయిందో కూడా అతను గుర్తించలేకపోయాడు. కాసేపు అన్నివైపులకు నిదానించి చూశాడు. జయశ్రీగాని ఆమెను అకస్మాత్తుగా మింగివేసిన గోళంగాని అతనికెక్కడా అగుపడలేదు. ఆందోళనతో అన్నిమూలలకు పోయి వెదికాడు. కాని, ప్రయోజనం లేకపోయింది. చివరకు నిరాశానిస్పృహలతో యుద్ధరంగంవైపు దృష్టిని సారించాడు.

ఇరుపక్షాలు యింకా పోరాడుతూనే వున్నాయి. కాని కుంభరాక్షసుని బలగం చాలవరకు నశించిపోయింది. ఉన్న సైన్యం కాస్తా పూర్తిగా బలహీనమైపోయింది. సింహపిశాచం సత్తువ దిగజారిపోతూంది. అది కేవలం ప్రాణరక్షణకు మాత్రమే పోరాడుతూంది. మూడు అస్థిభూతాలు అంతమైపోయాయి. చనిపోతూన్న సర్పప్రేతాల సంఖ్య మాటి—మాటికి పెరిగిపోతూంది. ఘడియలోనో, మరో ఘడియలోనో యుద్ధం ముగిసిపోతూందని, సంవత్సరాల తరబడి తపస్సు చేసి వశపరచుకున్న సింహపిశాచం, అస్థిభూతాలు, సర్పప్రేతాలు మాయాభామిని బలగం చేతుల్లో తప్పక నశించిపోతాయని కుంభరాక్షసుడు గుర్తించాడు.

అతనికా భావన కలగడంతో ఎంతో వ్యాకులపడ్డాడు.

ఎన్నో కష్టాలకోర్చి సాధించిన బలమంతా కళ్ళముందే నశించి పోతూండడం చూసి చాలా బాధ పడసాగాడు. అంతలోనే సింహపిశాచం నోటి నుంచి వచ్చిన ఆక్రందనతో కుంభరాక్షసుని చెవులు గింగురు మన్నాయి. భయకంపితుడై అతనా ధ్వని వచ్చిన వైపు చూశాడు. అలా చూస్తూండగానే అతను సాధించిన శక్తులన్నిటిలోకీ మహా బలవత్తరమైన సింహపిశాచం ప్రాణం గాలిలోకి ఎగసి పోయింది.

ఆ దృశ్యాన్ని చూడ్డంతో కుంభరాక్షసుని గుండెమీద సమ్మెట పడ్డట్టయింది. బరువెక్కిన గుండెలతో అతను మీన భామిని వైపు చూశాడు.

మీనభామిని ఎప్పటిలా ఆనందోత్సాహాలతో పోరాటాన్ని తిలకిస్తోంది. ఆమె రూపం కళ్ళబడగానే కుంభరాక్షసుని హృదయం మండి పోయింది. అతని శరీరంలోని రక్తం ఉడికి పోయింది. తను కోరి తెచ్చుకున్న జయశ్రీని దూరం చేసి, తన బలాన్నంతా సర్వనాశనం చేసిన మీనభామినిని ప్రాణాలతో వుంచకూడ దనుకున్నాడు.

వెంటనే ధ్యానమగ్నుడై చేతిని పైకెత్తాడు. అతని చేతిలోకి ఒక ఖడ్గం వచ్చి నిలచింది. అతనా ఖడ్గంతో మీనభామిని మీదకు ఉరికాడు. పోరాటాన్ని చూస్తూన్న మీనభామిని ఆ విషయాన్నేమీ గమనించలేదు. కాని, తన ప్రత్యర్థిని అంతం చేసి విజయ గర్వంతో నిలబడి,చుట్టూ పరికిస్తున్నయొక్క మీన భామినియొక్కసింహపిశాచంకుంభరాక్షసుని రాకనుగమనించింది వెంటనే అడ్డు పడకపోతే మీనభామినికి ప్రాణగండం తప్పదని భావించింది. వెనుక ముంగులు చూడకుండా తొందరగా ముందుకు వెళ్ళి, కుంభరాక్షసునితో కలియబడింది. అయితే కుంభరాక్షసుని చేతిలోని మంత్ర బద్ధమైన కత్తి తాకిడికి అది తట్టుకోలేక విల విల తన్నుకొని ప్రాణాలు విడచింది.

అప్పుడు కలిగిన అలజడి మీనభామినికి పూర్తిగా చైత

న్యాన్ని కలిగించింది. ఆమె ఆత్రుతగా నాలుగు వైపులా చూసింది. అప్పుడే ప్రాణాలను కోల్పోయిన సింహపిశాచాన్ని, ఖడ్గంతో తన మీదకు వస్తున్న కుంభరాక్షసుణ్ని చూడ్డంతో అంతా అర్థం చేసుకుంది. తన ప్రాణ రక్షణకు పూనుకుని సింహ పిశాచం బలికావడం చూసి ఆమె జాలిపడింది. సింహ పిశాచం చావుకు బాధ్యుడైన కుంభరాక్షసుణ్ని చూడ్డంతో మహిషాసుర మర్దనిలా చిందులు త్రొక్కుతూ చేతులు పైకెత్తి దించింది. అలా చేస్తుండగానే ఆమె చేతిలో యిమిడిన కత్తి నీటిలో తళ తళ్ళాడ సాగింది.

మీనభామిని ఖడ్గాన్ని కదలిస్తూ "కుంభా! చాటుగా వచ్చి దెబ్బ తీయాలనుకున్నావు. కాని, చేత కాకపోయింది. పాపం! మంచి అవకాశం తొలగిపోయింది. దానికేంలే, ముఖాముఖిని పోరాడి నీ బలాన్ని చూపించు." అంటూ ఆమె అతన్ని సమీపించింది. కుంభరాక్షసుడు కూడా ఆవేశంగా ముందుకు వచ్చి, ఆమె ఖడ్గానికి తన ఖడ్గాన్ని తాకించాడు. ఆ తాకిడికి అయిన ఖణేలు మనే శబ్దంతో ఆ ప్రాంతమంతా మారు మ్రోగిపోయింది.

అయితే, కుంభరాక్షసుడు రెండవసారి కత్తినెత్తేలోపల మీనభామిని జలమధ్యంలోంచి పైకి లేచి వాయు మండలం మీదకు వెళ్లి నిలచింది. కుంభరాక్షసుడుకూడా ఆమె వెనుకనే నీటిపైకి వచ్చి గాలిలోకి ఎగిరాడు.

మరుక్షణంలో కత్తుల సమరం ప్రారంభమయింది. భీకర రూపాన్ని దాల్చిన కుంభరాక్షసుడు తీవ్రంగా పోరాడుతూ మీనభామినిని హతమార్చడానికి పూనుకున్నాడు. మీనభామిని అతనికా అవకాశాన్నెక్కడా యివ్వకుండా అతిలాఘవంగా పోరాడసాగింది.

ఆ పోరాటంలో క్షణాలు ఘడియలుగా మారాయి, పగలు గడచి రాత్రి వచ్చింది. అయినా పోరు కొనసాగుతూనే

వుంది...బాలభానుని అరుణ కిరణాలు సముద్ర జలాన్ని తాక సాగాయి. వాటితో పాటూ, పోరాటంలో గాయపడుతూన్న యిద్దరి శరీరాలనుంచి పైకుబుకుతూన్న రక్తబిందువులు క్రిందకు దిగజారి సముద్ర జలంలో కలిసి పోతున్నాయి.

మళ్లీ చీకటిపడింది...తిరిగి సూర్యుడుదయించాడు. వెలుగు, చీకట్లతో వాళ్ళకు నిమిత్తం లేనట్టు యిద్దరూ విరామం లేకుండా రాత్రింబగళ్ళు పోరాడుతూనే వున్నారు!

అయితే రోజులు గడిచే కొద్దీ కుంభరాక్షసుని బలం తగ్గు ముఖం పట్టడం ప్రారంభించింది. కాని, మీనభామినిలో ఎట్టి మార్పు రాలేదు. ఆమెలోని ఉత్సాహం ఏమాత్రం తగ్గలేదు. ముఖంలోని కాంతి కొంచెం కూడా తరగలేదు. అంతే కాదు, ఆమె రెట్టించిన ఆవేశంతో కుంభరాక్షసుని శరీరాన్ని చీల్చి చెండాడ్డం మొదలు పెట్టింది.

కుంభరాక్షసుడు తన బలహీనతను గుర్తించాడు. ఏదో విధంగా మీనభామినిని వంచించి అంతం చేయాలనుకున్నాడు. ఆమె అతని మనోభావాన్ని గ్రహించింది. క్రోధంతో కంపించి పోయింది. "కుంభా! నీ కుటిలత్వాన్ని తెలుసుకున్నాను. జీవితమంతా తపస్సు చేసినా నువ్వు నన్నేమీ చేయలేవు. ధర్మానికి కట్టుబడ్డందువల్ల నీతో నేను న్యాయంగా పోరాడ్డానికి సిద్ధపడ్డాను. కాని, నీలాటి భావనే నాకుంటే నా భూతబలగంతోనే నిన్ను మట్టుపెట్టించి వుందును. నీ నీచస్వభావం వెల్లడయింది. అందుకు తగిన ప్రాయశ్చిత్తం యిప్పుడే అనుభవిస్తావు" అంటూ మూసివుంచిన ఎడమ చేతి గుప్పెటను అతని వైపు విసిరింది.

ముహూర్తంలో కుంభరాక్షసుని శరీరం గాలిలో వూగి పోయింది. అతను నిలద్రొక్కుకునేంతలో మీనభామిని ప్రయోగించిన మంత్రశక్తి అతన్ని బంధించి అనంతజలరాశి అడుగుకు తీసుకుపోసాగాయి.

విరామం కలగడంతో తన శరీరానికి తగిలిన గాయాలను తడిమి చూసుకుంటోన్న మీనభామినికి అకస్మాత్తుగా జయశ్రీ గుర్తుకు వచ్చింది. ఆమె ఆత్రుతగా సముద్రంలో చొరబడి జయశ్రీ కోసం అన్వేషణగా గాలించింది. కాని, జయశ్రీ ఎక్కడా ఆమెకు కనబడక పోవడంతో భయాందోళనలతో కంపించిపోతూ "జయశ్రీ ఏమైంది! జలస్తంభన శక్తిని కలిగించి విడచిన జయశ్రీని ఎవరు ఎత్తుకపోయారు? ఇక నాకు శాపం తొలగే మార్గం లేదా! నా భర్తను పొందే యోగం లేదా?" అనుకొని మనస్సులో మదనపడుతూ తన జలాంతర్భవనంలోకి ప్రవేశించిన మీనభామిని—జయశ్రీ ఎక్కడుందో తెలుసుకోడానికి ప్రత్యక్షదర్పణం ముందు నిలిచింది...

# 33

జయశ్రీని తలుచుకుంటూ స్పృహతప్పిపోయిన సుకుమార్‌ని రూపకామిని భటులు బయటకు మోసుకుపోయి నేల మీద పడుకోబెట్టారు. తర్వాత వాళ్ళిద్దరు తమ మాయాబలంతో ఆకాశంమీద రాళ్ళగుట్టలను సృష్టించి రూపకామిని ఆజ్ఞ కోసం ఎదురు చూడసాగారు.

రూపకామిని వారి వెనకనే వచ్చి ప్రక్కను నిలడింది. ఆమె చూపులు నేలమీదపడివున్న సుకుమార్ మీద వున్నాయి. ఆమె కళ్ళల్లో ఈర్ష్య, ద్వేషం, పగ, ప్రతీకారం ప్రళయ నృత్యం చేస్తున్నాయి. అయితే మరోవైపున ఆశ, మమకారం వేదన, దిగులు ప్రత్యక్షరూపాలు దాల్చి మనస్సును కలవర పరుస్తున్నాయి.

ఆమె అతని వంకే చూస్తూ 'కాళ్ళ మీదపడి ప్రార్థిస్తే కాదని త్రోసేశాడు. నువ్వే నా సర్వస్వం అంటే మరో భర్తను చూసి వివాహం చేస్తానన్నాడు. వలచి వచ్చిన వనిత

అంత చులకనగా కనబడుతుంది కాబోలు! ఎంతమంది ఇతన్ని వరించి వస్తే ఎందరు భర్తల్ని కట్టబెడతాడో! ఇతనన్న మాటలు హృదయంలో ములుకుల్లా నాటి అరని ప్రతీకారాగ్నిని ప్రజ్వరిల్లజేస్తున్నాయి. అయినా ఓర్పుతో కొంతకాలం వేచివుంటే ఒక దారికి వస్తాడనుకున్నాను. కాని, అలాంటి ' ఆశ ఎక్కడా కనిపించడం లేదు... నాకు లేని అదృష్టం జయశ్రీకెలా ప్రాప్తిస్తుందో చూస్తాను. నన్ను తృణీకరించిన యితను జయశ్రీతో ఎలా సుఖిస్తాడో తెలుసుకుంటాను. ఎప్పుడో తెలుసుకోవడమేమిటి ' యిప్పుడే యితని ప్రాణాలు తీయించి నా హృదయంలో రగులుతూన్న దావాగ్నిని చల్లార్చుకుంటాను, అప్పుడు గాని నాకు మనశ్శాంతి లభించదు.' అనుకుంది. ఆమె వెనుక ముందు లాలోచించకుండా వెంటనే భటులవైపు చూసింది.

ఆజ్ఞకోసం వేచివున్న భటులు మౌనం వహించి రూపకామిని ముఖంలోకి చూడసాగారు.

కాని, రూపకామిని ఏమీ మాట్లాడకుండా తిరిగి సుకుమార్ వైపు చూసింది.

స్పృహ తప్పి పడివున్న సుకుమార్ ముఖంలో క్రమంగా ఉత్సాహం అలుముకుంటూంది. పెదాలమీద ఆనందం చిందులాడుతూంది. ఒక్కొక్కప్పుడతను నోరువిప్పి మౌనంగా నవ్వుతున్నాడు. అంతలోనే నొసలు ముడతలుపడి, కనుబొమల దగ్గరకు చేరుకుంటున్నాయి. ఆ సమయంలో అతని ముఖమంతా ఆందోళనతో నిండి పోయింది. మరుక్షణంలో అతని కుడిచెయ్యి నడుము చుట్టూ తిరుగుతూ దేనికోసమో వెదక సాగింది. కొన్ని క్షణాలు గడిచాక అతని పళ్లు పటలాడుతూండగా కుడిచేతి వ్రేళ్లు దగ్గరకు ఒంగి పిడికిలి బలంగా ముడుచుకుని తిరిగి వెంటనే విడిపోయింది. దానితో అతని ముఖంలో వచ్చిన మార్పులన్నీ తొలగిపోయాయి. అవయవాల

కదలిక నిలచిపోయింది. శాంతంగా ఊపిరి పీల్చుకోసాగాడు. కాని, అతనికి చైతన్యం మాత్రం కలగలేదు.

సుకుమార్ ముఖంలో కనబడుతూన్న మార్పుల్నిబట్టి, అతను కేవలం జయశ్రీ కోసమే కలవరపడుతూన్నాడని ఆమె గ్రహించింది. జయశ్రీ భాగ్యానికి ఆమె చాలా ఈర్ష్య పడింది. ఆ అదృష్టం తనకు కలగకుండా పోతున్నందుకు ఎంతో వేదన చెందింది. రూప, గుణ, సౌందర్యాల్లోనే కాకుండా శక్తి, సమర్థతల్లో కూడా ఎవ్వరికి తీసిపోని సుకుమార్ హృదయ పీఠాన్నలంకరించిన జయశ్రీ పేరు తలుచుకొని చాలా అసూయ పడింది-రూపకామిని.

అసూయ ప్రతీకార రూపాన్ని దాల్చింది. అందుకు ప్రతి ఫలంగా, మరోమారు ప్రయత్నించి సుకుమార్ని తన వానిగా చేసుకోవాలనుకుంది రూపకామిని. ఆమెకా భావం కలగడం తోనే అతనిమీదనున్న మక్కువ మళ్లీ ఎక్కువ కాసాగింది. అంతవరకు వున్న ద్వేషం ప్రణయంగా మారిపోయింది. ఈర్ష్యాసూయలు అంతరించిపోయాయి.

ఆశాపూరిత నేత్రాలతోను, ఆ లిగొన్న హృదయంతోను ఆమె చాలాసేపు అతని ముఖంలోకే చూస్తూ వుండిపోయింది. అలా చూస్తూనే అప్రయత్నంగా నిట్టూర్చింది. బలమైన ఆ నిట్టూర్పులోంచి 'హుం' అనే శబ్దం వచ్చింది.

ఆమె నోటినుండి వచ్చిన నిట్టూర్పులోని ధ్వనినే ఆజ్ఞగా భావించారు-భటులు. మరుక్షణంలో యిద్దరూ తాము సృష్టిం చిన రాతిగుట్టలనుండి రెండు రాతి బండలను సుకుమార్ మీద ప్రయోగించారు. ఆకాశం మీద నున్న గుట్టలనుంచి వేరు పడిన రెండు బండలు రివ్వుమని ధ్వని చేసుకుంటూ అతి వేగంగా సుకుమార్ మీదకు రాసాగాయి. భటులు మరో రెండు రాతి బండలను ప్రయోగించాలని తలంపుతో ధ్యాన మగ్నులై కళ్లు మూసుకున్నారు.

మొదట ప్రయోగించిన రాళ్ళు భూమిని సమీపిస్తున్నాయి. రాను రాను వాటి ఆకారాలు పెరగసాగాయి. దగ్గరకు వస్తున్న కొద్దీ వాటి నుంచి వస్తున్న ధ్వని అధికం కాసాగింది. ఆలోచనా నిమగ్నురాలై సుషుప్తావస్థలో నున్న రూపకామిని తొట్రుపాటుతో పైకి చూసింది. అమిత వేగంతో తమ వైపుకే వస్తున్న రెండు రాతి బండలను తిలకించింది తన భటులే వాటిని సుకుమార్ మీద ప్రయోగించారని గ్రహించింది. తన అనుమతి లేకుండా వాళ్ళంత దుస్సాహసానికి తలపడినందుకు చాలా ఆగ్రహం కలిగింది. అయితే. భటులను మందలించడానికిగాని. వాటిని ఉపసంహరించడానికిగాని సమయం చాలదని గుర్తించింది. ఏదోవిధంగా వాటి మార్గానికి నిరోధం కలిగించకపోతే సుకుమార్‌కి ప్రాణాపాయం తప్పదని భావించింది.

ఆమెకా భావన కలగడంతో గుండెలు దడదడలాడాయి. శరీరం కంపించింది. క్షణకాల మామె నిర్జీవ ప్రతిమలాగా నిలుచుండి పోయింది. రాతి బండలు క్రమంగా దగ్గర కొస్తున్నాయి. అవి సుకుమార్ దేహాన్ని తాకితే మాంసఖండాలతో పాటు అతని శరీరంలోని ఎముకలు కూడా తుత్తునియలై పోతాయని ఆమెకు తెలుసు. ఏమి చేయడానికీ తోచక ఆమె తికమకలు పడుతూన్నంతలో రాతి బండలు నేలను సమీపించాయి. కన్నుమూసి తెరచేంతలో అవి సుకుమార్‌ని తాకి అతన్ని మాంసపు ముద్ద చేసి విడుస్తాయని గ్రహించిన రూపకామిని ఆందోళనతో తన రెండు చేతులను పైకెత్తి, సుకుమార్‌ని తాకడానికి సిద్ధపడుతూన్న రెండు రాళ్లను రెండు వైపులకు విసరింది.

రూపకామిని ప్రయత్నం ఫలించింది. సుకుమార్‌ని తాకబోయిన ఆ రెండు రాళ్లు దూరంగా పోయి నేలమీద పడ్డాయి.

అయితే అవి తేలను నాకేముందని రూపకామిని భటు లిద్దరిని తమ పొట్టను పెట్టుకున్నాయి!

విలవిల తన్నుకుని ప్రాణాలు విడచిన యిద్దరు భటులను చూసి రూపకామిని విపరీతంగా బాధపడింది. కాని, ఆ సమయంలో సుకుమార్ ని రక్షించడం కోసం, ఆకలిగొన్న ఆ రాతి బండలకు తన భటులను ఆహారంగా యివ్వకపోతే అవి తనను కూడా కబళించడానికి వెనుకాడవని ఎరిగున్న రూపకామిని తన హృదయంలో కలిగిన వ్యథను బలవంతంగా దూరం చేసుకుంటూ, సుకుమార్ కి దగ్గరగా కూర్చుని, అతనికి తెలివి కలిగించడానికి పూనుకుంది.

సుషుప్తావస్థలోనున్న సుకుమార్ లో చలనం ప్రారంభమయింది. అతని శరీరం ఒణికిపోతూంది. చేతివ్రేళ్లు గట్టిగా ముడుచుకొని అంతలోనే విడిపోతున్నాయి. ముఖంలో భయం, ఆందోళన, నిరాశ, నిస్పృహ స్పష్టంగా కనబడుతూ - మరుగు పడుతూన్నాయి. కొంతసేపలా గడిచాక అతని పెదాలు కదలసాగాయి. సుషుప్తావస్థలోనే అతను ఇలా మాట్లాడడం ప్రారంభించాడు. "జయశ్రీ, ఎన్నివిధాల ప్రయత్నించినా నిన్ను రాక్షసుని చేతుల్లోంచి విడిపించలేకపోతున్నాను. నీకు దగ్గరగా రాలేకపోతున్నాను. అబ్బా, ఈ విరహ సాగరాన్ని యీదలేకపోతున్నాను. ఈది. యీది నా శరీరం అలసిపోయింది. విధిలేక మళ్ళీ ఒడ్డుకు చేరాను. ఇవతలి ఒడ్డున నేనుంటే అవతలిగట్టున నువ్వున్నావు. వందల కొద్దీ యోజనాల విస్తీర్ణమున్న అగాధజలరాశిని దాటి నిన్ను చేరలేకపోతున్నాను... నా మాట నమ్ము. నువ్వే నాకు సర్వస్వం. నువ్వే ఆరాధ్యదేవతవు. నీ కోసం నేనేమైనా చేస్తాను. కాని, యీ అనంత జలరాశిని అధిగమించలేకపోతున్నాను... అదేం? ఏడుస్తున్నావు. నా మాటలు అబద్ధమా! నా హృదయంలో మరొకరికి స్థానమిస్తున్నానా! అందుకే నువ్వు నాకు దూరంగా

వుంటున్నావా !...జయశ్రీ...జయశ్రీ, నేనంత నీచుడ్ని కాను. నీకు నేనెన్నడు అన్యాయం తలపెట్టలేదు. అక్రమానికి ఒడికట్టలేదు. నీ కింకా అనుమానం తీరకపోతే నా హృదయాన్ని చీల్చి చూడు. నీ ప్రతిబింబం తప్ప దానిలో మరొక రూపమే లేదు...అబ్బా!...బరువెక్కిన హృదయం యిప్పటికి తేలికపడింది. మనస్సుకు పరిపూర్ణమైన శాంతి లభించింది. నీ పెదాలు చిలికిస్తూన్న చిరునవ్వు, కళ్లలో కనబడుతూన్న కాంతి, ఉత్సాహపూరితమైన వదనం నా జీవితపథంలో పూలబాటను ఏర్పరుస్తున్నాయి...ఏదీ, కొంచెం దగ్గరకు రా... యింకా...కొంచెం...ఏం జయా ! అంతదూరంగా తొలగిపోతున్నావేం ? నిన్ను తినేస్తానని భయపడుతున్నావా ! కల్పవృక్షాన్ని కాళ్లదన్నేవాడా, అమృతభాండాన్ని బ్రద్దలు చేసేవాడు వుంటాడంటావా ? అనుమానించకు. దగ్గరకు రా. నీ చెక్కిళ్ళను చేతిలో తాకి బలంగా...ఆఁ ! జయా ! జయశ్రీ!! అంతలోనే అలా మారిపోయేవేం? నీ ముఖంలో ఆ విషాదరేఖ లేమిటి ? జలపూరితాలయిన నీ నేత్రాలు నా హృదయంలో తుఫాను రేపు తున్నాయి. నీ దీన వదనాన్ని తిలకించలేక పోతున్నాను. మందస్మిత వదనవై నీ ప్రేమ చూపులను నా మీదకు ప్రసరింపజేయి. నా మీద నీ కెలాంటి కోపం లేదని తెలియజెయ్యి. నీ నోటి నుంచి వచ్చే అమృతవాక్కు కోసం నా కర్ణేంద్రియాలు తపించిపోతున్నాయి...జయా ! మాట్లాడవేం? నా కోసం నోరు విప్పు. ఒక్క పలుకు పలుకు" అని తిరిగి చైతన్య రహితుడై పోయాడు సుకుమార్.

ఆ సమయంలో సందర్భాన్ననుసరించి అతని గొంతుకలో కలుగుతూన్న మార్పులతో పాటు ముఖ కవళికలు కూడా మార్పుచెందుతూ వచ్చాయి.

సుకుమార్ నోటినుంచి జయశ్రీ పేరు విన్నప్పుడల్లా రూప

కామిని మనస్సు భగ్గున మండిపోతున్నా, అప్పటి అతని స్థితి చూసి ఆమె జాలిపడకుండా వుండలేకపోయింది. చేతితో అతని శరీరాన్ని తాకి, నిమురుతూ 'సుకుమార్' అంది లాలనగా.

రూపకామిని నోటినుండి వచ్చిన అక్షరాలు సుకుమార్ అంతరేంద్రియాలమీద బాగా పనిచేశాయి. అతనిలో తిరిగి కదలిక కలిగింది. ముఖం నిండా సంతోషం అలుముకుంది. "జయా! నా జయా! ఎంత సున్నితమైన హృదయం నీది! ఏదీ, యిప్పుడన్నమాట మరొక్కసారి అను. నా హృదయంలోని బరువు, మనసులోపలి బాధ ఒక్కసారిగా తొలగిపోయేలా మరొక్కసారను...ఆహా! నీ నోటినుంచి వచ్చిన ఆ అక్షరాలు నిర్మల నదీజలం మీంచి వచ్చిన పిల్లవాయువుల్లా, నా మనస్సును తాకి చల్లబరిచాయి. నా హృదయానికి ఊరట నిచ్చాయి. నన్ను శాంతచిత్తుని చేశాయి. జయా! నాకు సమీపంగా వచ్చి, నా చెవి దగ్గర నీ రుపెట్టి మరొక్కమారు 'సుకుమార్' అని వుచ్చరించు" అన్నాడతను అర్థచైతన్యంగా.

రూపకామిని కొంసేపాలోచించింది. అతనికి తెలివి రాక ముందే తన మాటలతో మెప్పించి, అతని బాహువుల్లో ఝురుక్కొని వక్షానికి అంటుకు పోవాలనుకుంది. ఆమె నేలమీద పడివున్న సుకుమార్‌కి బాగా దగ్గరగా జరిగింది. కాళ్ళను నిలువుగా ఒక ప్రక్కకు చాపి సుకుమార్ వైపు తిరిగింది. రెండు చేతులతోను అతని భుజాలను పట్టుకొని, మోచేతులను వక్షానికి అన్చి ముందుకు వంగింది. తర్వాత మెల్లిదిగా తన నోటిని సుకుమార్ చెవి దగ్గరకు పోనిచ్చి "సుకుమార్! నీ మనస్సును చాలా కలవరపరిచాను. నీ కింత బాధ కలుగు తుందని అనుకోలేదు. నా తప్పిదాన్ని మన్నించు." అంది వలపు నొలికిస్తూన్న గొంతుకతో.

సుకుమార్ తృప్తిగా నిట్టూర్చాడు. అతని చేతులు

మెమ్మదిగా రూపకామిని వీపుమీదకు చేరాయి. "జయా! యిందులో నీ పొరపాటేమీ లేదు. అంతా నాదే లోపం. రూపకామిని తన మాయాబలంతో నన్ను బందీని చేసింది. ఆమె ఎదుట నా శక్తి, సమర్థతలు ఏమీ పని చెయ్యకుండా పోయాయి. అన్ని విధాలా అసమర్థుణ్ణయి పోయాను. అందుకే మనకీ ఎడబాటు కలిగింది. ఇహ నన్ను విడచిపోవు కదూ! ఇలానే ఎప్పుడూ నాకు దగ్గరగా వుంటావు కదూ!... జయా! మాట్లాడవేం, యింకా కోపమేనా?" అన్నాడు తిరిగి కొంచెం కలత చెందిన మనస్సుతో.

రూపకామిని శ్వాసను బరువుగా పీల్చి విడిచింది. అపుడు ముందుకు ఒంగివున్న ఆమె వక్షం సుకుమార్ ఛాతీని తాకి పైకి లేచింది. ఆ సమయంలో కలిగిన ఒత్తిడికి రూపకామిని అవయవాలు ఆనందంతో కూడిన అలసటతో క్షణకాలం మత్తుతో సోలి పోయాయి. ఆమె వెంటనే నిగ్రహించుకుని అలానే సుకుమార్ మీదకు ఒరిగి వుండి "సుకుమార్! నే నెల్లప్పుడు నీ దాననే! నీ వలపు చూపుల కోసం, ప్రేమ వాక్కులకోసం నా హృదయం తపించి పోతూంది. నీ బిగి కౌగిలిలో యిమిడిపోయే సమయం కోసం నా మనస్సు ఉరకలు వేస్తుంది... నేను నీ హృదయాన్ని గాయపరిచాను. మనస్సును వేధించాను. నీలో ధరించలేని కల్లోలాన్ని రేకెత్తించాను. చెప్పనలవి కాని బాధకు గురి చేశాను. సుకుమార్, నా అపరాధాన్ని మన్నించానని చెప్పి, నన్ను నీ హృదయానికి గాఢంగా అదుముకో. అప్పటికిగాని నా మనోవేదన తొలగదు. నా ఆత్మకు శాంతి కలుగదు" అంది.

సుకుమార్ ఏమీ మాట్లాడలేదు. అయినా రూపకామిని వీపుమీద నున్న అతని చేతులు క్రిందకు జారిపోకుండా, యింకా అలానే బలంగా అంటిపెట్టుకుని వుండిపోయాయి.

రూపకామిని గొంతుకను గుక్కపూరితం చేసుకుంది. ఆమె బాధను నటిస్తూ "సుకుమార్ యింత తిరస్కారమా ' ని మానం నా శరీరాన్ని దహించేస్తూంది. నీ అనుగ్రహానికి దూర మైన నా బ్రతుకు వ్యర్థం. నా జీవితం వృథా. నన్ను విడిచి పెట్టు. నా కర్మకు నేను బలి అవుతాను" అని అతని చేతుల నుంచి తప్పించుకోడానికి ప్రయత్నిస్తూన్నట్లు అభినయించ సాగింది.

క్షణంకూడా గడవకముందే సుకుమార్‌లో మార్పు వచ్చింది. అతని ముఖం ఆందోళనలో నిండి పోయింది. అతని చేతులు మరింత బలంగా రూపకామినిన్ని పెనవేసుకున్నాయి. మరుక్షణంలో రూపకామిని సుకుమార్ వక్షానికి అంటుకు పోయి బలమైన అతని బాహుబంధంలో నలిగిపోతూ, ఊపిరి కోసం ఆత్రులు చాచడం మొదలు పెట్టింది.

అలా మరికొంతసేపు గడిస్తే ఏమైపోయ్యేండేదో కాని అంత లోనే సుకుమార్ అవయవాలు పట్టువిప్పాయి. రూపకామిని చుట్టబెట్టుకున్న చేతులు క్రిందకు జారిపోయాయి. అతను తిరిగి చలన రహితుడై పోయాడు.

బాహుపాశాన్నుంచి విడివడ్డ రూపకామిని శ్వాసకోశాల నిండా ఊపిరి పీల్చుకుంది. సుకుమార్ బాహువలయంలో బలవత్తరంగా నలిగిపోయిన ఆమె అవయవాలు విశ్రాంతిని కోరి వేధించసాగాయి. రూపకామిని గడచిన మధురక్షణా లను తలుచుకుంటూ. వక్షంమీది వస్త్రాన్ని సవరించాలని ఓపికగా అనుకునేంతలో సుకుమార్ శరీరంలో మళ్ళీ చలనం ప్రారంభ మయింది. అతని నోటినుంచి "జయా! యింతలోనే ఏమై పోయావు. నా బాహువుల్లోంచి ఎలా తప్పించుకున్నావు. ఎక్కడకు పోయావు" అన్న మాటలు బయటకు వస్తుండగా చేతులు రెండూ కంగారుగా చుట్టూ వెదకసాగాయి.

అది గమనించిన రూపకామిని తన ప్రయత్నాన్ని విర

మించుకుని ఎప్పటిలా సుకుమార్‌కి సమీపంగా చేరి, అతని వక్షంమీద చేతిని ఆన్చి "సుకుమార్" అంది కోమలంగా.

కొంతసేపటికి సుకుమార్‌కి పూర్తిగా చైతన్యం కలిగింది. అతను కళ్లు విప్పి చూశాడు.

# 34

రూపకామినిదగ్గర గా కూర్చుని సుకుమార్ శరీరాన్ని తన చేతితో మృదువుగా నిమురుతూంది. సుకుమార్ కళ్లు విప్పగానే ఆమె తృప్తిగా శ్వాస పీల్చుకుని "సుకుమార్" అంది . మళ్ళీ కరుణాపూరిత కంఠంతో.

సుకుమార్ ఆమె పిలుపును వినలేదు. తొందరగా లేచి కూర్చున్నాడు. అంతకుముందు జరిగిన సంఘటనలేమీ అతనికి గుర్తులేవు. అనుమానాశ్చర్యాలతో చుట్టూ పరికించి విభ్రాంతుడయ్యాడు. ముందొకసారి తను అగ్నిగుండంలోకి విసరివేసిన యిద్దరు భటుల శరీరాలు శిథిలమై నేలమీద పడివుండడం చూసి అతను ఆలోచనలో పడ్డాడు. అంతేకాదు, తనను బందిఖానా నుండి బయటకు తీసుకు వచ్చిందెవరో తెలుసుకోవాలని తీవ్రంగా ప్రయత్నించాడు. అతని కక్కడ క్రొత్తవాళ్ళెవరు కనిపించలేదు. అయినా, తన క్షేమాన్ని కోరినవాళ్ళెవరో తనకు విముక్తి కలిగించారని, వాళ్ళే రూపకామిని భటుల నిద్దరిని హతమార్చి వుంటారని అతను భావించాడు. ఆపదలో సహాయపడిన ఆప్తులెవరో తెలుసుకోవాలని అతను మరొకసారి చుట్టూ కలయచూడసాగాడు.

అతని ఉద్దేశాన్ని గ్రహించిన రూపకామిని తిరిగి "సుకుమార్" అంది లాలనగా.

సుకుమార్ రూపకామిని కళ్లల్లోకి తీవ్రంగా చూశాడు. అతని చూపుల్లో వున్న పదును తన హృదయాన్ని తునక తునకలుగా తరుగుతూన్నట్టు బాధపడిందామె. అయినా కొంత

బాధను నిగ్రహించుకుని లేచి నిలబడి, కుడిచేతిని సుకుమార్ తలలోకి పోనిచ్చి, శిరస్సును వేళ్ళతో సున్నితంగా స్పృశిస్తూ "సుకుమార్, ఇంకా కోపం తీరలేదా? నేను నీకు చేసిన అన్యాయమేమిటి? నా వల్ల జరిగిన మహాపరాధమేమిటి? ఎందుకు నామీదింత అలుకబూనావు!" అంది రూపకామిని అశ్రుపూరిత నేత్రాలతో.

సుకుమార్ ఏమీ మాట్లాడకుండా తన తలలో వున్న రూపకామిని చేతిని విదలించి కొట్టాడు.

ఆమె కది చాలా అవమానంగా తోచింది. అయినా సహించుకుని "సుకుమార్! వలచిన వనితను యింత చులకనగా చూడ్డం మంచిదికాదు. ప్రేమించిన కాంతను కాదనడం భావ్యంకాదు." అంది నెమ్మదిగా రూపకామిని.

సుకుమార్ కళ్ళు అగ్నికణాల్లా ఎరుపెక్కిపోయి. "నాకు నీతులు బోధించేంత అర్హత వుందా నీలో!" అన్నాడతను కటువుగా.

"సుకుమార్. నన్ను అపార్థం చేసుకుంటున్నావ. నా ఆత్మను నీకర్పించాను. నా శరీరాన్ని నీకంకితం చేశాను. నన్ను నమ్ము." అంది కామిని వినయ విధేయత లుట్టిపడుతూన్న కంఠంతో.

"వలపు-ప్రేమ, అర్పితం - అంకితం!...ఎంత చక్కని పదాల్ని వుపయోగించావు!... కామినీ! నిన్ను బాగా అర్థం చేసుకున్నాను. యింతవరకు నీ వలపును పంచుకున్నవాళ్ళందరూ కైపులోపడి మగ్గుతూన్నట్టు నీ మాటలవల్లే తెలుసుకున్నాను. యిహ నీ ప్రేమకు పాత్రులైన వాళ్ళంతా జ్ఞానశూన్యులై, వివేకాన్ని మరచి, నీ పొందుకోసం నిట్టూర్పులు విడుస్తున్నారనీ గ్రహించాను. కామినీ! కామోద్రేకంలో ఒళ్ళు మరచి, నీతిని విడిచి, కంటికి నచ్చినవాడ్ని కనుసన్నలతో మత్తెక్కించి అవసరాన్ని తీర్చుకుని అవతలకు నెట్టి

చేయడం నీకు అలవాటైపోయింది. వరుసగా అందరూ పాత వాళ్ళై పోవడంవల్ల నీకు క్రొత్తవాడ్ని కావలసివచ్చాను. సరి పాటైన పద్ధతి ననుసరించి, వంచించి నన్ను కూడా నీ పొందు కోసం తపింపచే వాళ్ళలో కలపాలనుకుంటున్నావు. కామినీ! అందరి దగ్గరా నీ ఆటలు సాగవు. జరిగిందేదో యింతవరకు జరిగింది. యిక నీ వుద్దేశాన్ని మార్చుకో." అన్నాడు సుకుమార్ దృఢంగా.

రూపకామిని కాసేపు ఏమీ మాట్లాడకుండా అమాయకత్వాన్ని నటిస్తూ అతని ముఖంలోకి చూస్తూ వుండిపోయింది. తర్వాత ఆమె నెమ్మదిగా అతని చేతిని పట్టుకుంటూ "సుకుమార్! అబలమీద అంత ఆగ్రహం చూపించడం ధర్మమా—" అని బొంగురుపోయిన గొంతుకతో యింకా ఏదో అనబోతూండగా—

"ఛీ! కులటా! కలుషితమైన నీ శరీర స్పర్శ తగలడంవల్ల నా హృదయం మండి పోతూంది. నటనతో మోసపరచు కోవాలనే ప్రయత్నాన్ని విడిచిపెట్టు. చేసిన పొరపాట్లకు పశ్చాత్తాపం చెంది, యిప్పటినుంచైనా బుద్ధిగా ప్రవర్తించు. భగవంతుడు మెచ్చుకుంటాడు." అంటూ ఆమె చెయ్యి తగిలిన భాగాన్ని బాధగా తడిమి చూసుకున్నాడు సుకుమార్.

ఆ మాటలకు రూపకామిని హృదయం భగ్నమైంది. అయినా సహనం వహించి చివరిసారిగా ప్రయత్నించాలనుకుంది. ఆమె సుకుమార్ వదనంలోకి దీనంగా చూస్తూ "ఆ! నీ ఆజ్ఞను శిరసావహిస్తాను. నీ అడుగుజాడల్లో నడుస్తాను. నీ కనుసన్నలలో మెలగుతాను. నా కోరికను మన్నించి నీ హృదయంలో నాకు కొంచెం చోటియ్యి." అంది.

"కామినీ! నీ కల్లిబొల్లిమాటలతో నా దృఢ నిశ్చయాన్ని మార్చలేవు. నువ్వు ఎంత ప్రయత్నించినా నా మనస్సు చలించదు. పదిసార్లు కాదన్నా ప్రాకులాడుతూన్న నీ హృదయ

దౌర్బల్యానికి జాలిపడుతున్నాను. ఇప్పటికైనా నీ వుద్దేశాన్ని మార్చుకుని, నన్ను విడిచిపెట్టు." అన్నాడు సుకుమార్ తీక్ష్ణంగా.

సుకుమార్ అన్నమాటలతో రూపకామిని ఓర్పు నశించిపోయింది. ఆమె విషపురుగులా ఎగిరిపడింది. సుకుమార్ కళ్ళల్లోకి చుర-చుర చూస్తూ "సుకుమార్, నీయందున్న మమకారం కొద్దీ నువ్వేమన్నా సహించాను. ఓర్పు వహించి విన్నాను. ఇక నాలో ఆ ఓపిక తొలగిపోయింది. ఆఖరు సారి అడుగుతున్నాను. నా మాటను అంగీకరిస్తావా, లేదా" అంది కఠినంగా.

సుకుమార్ నిర్లక్ష్యంగా ఆమె కళ్ళలోకి చూసి "రూపా! నీ బెదిరింపులకు భయపడేవాడ్ని కాను. ఏ పరిస్థితిలోను నా మనస్సు చలించదు. నీ శక్తియుక్తులు నా నిశ్చయాన్ని మార్చలేవు. ఆ విషయం నన్ను అగ్నిగుండంలోకి విసిరివేయించే ముందే తెలుసుకున్నావు. అయినా ఆశ తీరక చాలా శ్రమపడ్డావు. ప్రయత్నించి—ప్రయత్నించి బాగా అలసిపోయావు. వెళ్ళి విశ్రాంతి తీసుకో" అన్నాడు వెటకారంగా.

అతని మాటలామె గుండెల్లో ములుకుల్లా నాటాయి. దానితో అంతవరకు అణగివున్న ఆవేశం పైకి ఉబికింది. ఆమె ప్రళయరూపిణిలా చిందులు త్రొక్కుతూ "సుకుమార్! నీ జీవితం నేటితో అంతమయింది. అందుకే హద్దుమీరి నన్ను ఎగతాళి చేశావు. అందుకు ఫలితం యిప్పుడే అనుభవిస్తావు" అంటూ పిడికిలి బిగించి ముందుకు విసిరి విడిచిపెట్టింది.

ఆమె చేతిని వెనక్కి తీసుకునేంతలో ఎదుట పెద్ద సరస్సు ఏర్పడింది. ఆ సరస్సంతా భీకరమైన మొసళ్ళతో నిండిపోయి వుంది.

రూపకామిని సుకుమార్‌కి ఆ సరస్సును, అందులోని

మొసళ్ళను వ్రేలితో చూపించి, ప్రక్కనే చచ్చిపడివున్న తన భటుని శరీరాన్నెత్తి ఆ సరస్సులో విడచిపెట్టింది...మరు క్షణంలో మొసళ్ళన్నీ తమకు దొరికిన ఆహారం మీదకు విరుచుకుపడ్డాయి. కన్నుమూసి తెరచేంతలో భటుని శరీరం అదృశ్యమై పోయింది.ఆ దృశ్యాన్ని చూసిన సుకుమార్ గుండె లొకమారు జల్లుమన్నాయి.

అంతలోనే, తిరిగి ఆమె తన రెండవ భటుని శరీరాన్ని కూడా నీట విడిచింది. ఆమె అలా విడిచీ విడవడంతోనే ఆతని దేహం కూడా మొసళ్ళకు ఆహారమై పోయింది. ఆకలి గొన్న ఆ మొసళ్ళు అంతటితో తృప్తి చెందక ఒడ్డున కనబడు తూన్న సుకుమార్ మీదకు ఉరకలు వేసుకుంటూ రాసా గాయి. తనమీదకు వస్తున్న మొసళ్ళను చూసి సుకుమార్ కొంచెం తొట్రుపడ్డాడు.

ఆ విషయాన్ని గమనించిన రూపకామిని ఒడ్డుకు చేరు తూన్న మొసళ్ళను అదలించి సుకుమార్ వంక చూసింది. ఆమె అదలించగానే వెనుదిరిగి పోతున్న మొసళ్ళను ఆశ్చ ర్యంగా చూడసాగాడు సుకుమార్.

“సుకుమార్” అంది దృఢంగా రూపకామిని.

ఆమె ఉచ్చారణలో అధికారం - సంబోధనలో అహం భావం - పడగవిప్పిన పాముల్లా తలలెత్తి మెదలసాగాయి.

సుకుమార్ భావరహితంగా ఆమె ముఖంలోకి చూశాడు.

“సుకుమార్, చూశావా-నా పెంపుడు జంతువుల మొరటు దనం. ఆకలితోనున్న ఆ జంతువులు నిన్నే కబళించాలని చూస్తున్నాయి...వాటి నోళ్ళకు చిక్కి దుర్మరణం పాలు కాకుండా వుండాలంటే నీ వుద్దేశం మార్చుకోక తప్పదు. ఏమంటావు?” అంది రూపకామిని.

“కామినీ! కామతృష్ణతో రగులుతుండటంవల్ల నీ కెంత చెప్పినా తెలియకుండా వుంది. మాటకోసం ప్రాణాలర్పించే

వంశం మాది. జయశ్రీని వరించాను. ఆమెకు నా హృదయంలో స్థానమిచ్చాను యిహ నీ కక్కడ చోటు దొరకదు. బ్రతకడం కోసం లక్ష్యాన్ని మార్చుకోవడం నాకు చేతకాదు." అన్నాడు సుకుమార్ నిశ్చలంగా.

రూపకామిని యిహ ఏమీ మాట్లాడలేదు. ఒకసారి సుకుమార్ కళ్ళల్లోకి క్రూరంగా చూసి, మరుక్షణంలో అతన్ని తన మంత్ర ప్రభావంతో సరస్సులోకి విసరేసింది.

* * *

ఇనుపకొట్టులో బంధించబడి వున్న కాలకేయుడు ఆ దృశ్యాన్ని చూసి భయాందోళనలతో 'ఆఁ!" అని గట్టిగా అరచాడు.

రూపకామిని పకపక నవ్వుతూ విజయగర్వంతో వెనక్కి తిరిగి కాలకేయుని వైపు చూసి "గురువుగారూ! బాధ పడకండి. మొసళ్లు తినగా మిగిలిన అస్థిపంజరాన్ని భద్రంగా అతని దేశానికి చేర్చే బాధ్యత మీకే అప్పగిస్తాను." అంది గట్టిగా.

"కామినీ! నీకు అంత్యకాలం సమీపించే యింత దుర్మార్గానికి పూనుకున్నావు. సుకుమార్ మరణించాడన్న వార్త వింటే జయశ్రీకి తోడబుట్టిన వానిలా పెరుగుతూ,-చిన్నవాడు నీ తండ్రి మరణానికి కారకుడై నీ పెంపుడు సింహం-'రాజా'ను హతమార్చిన జయానంద నిన్ను చిత్రవధ చేయకమానడు" అంటూ కాలకేయుడు సరస్సువైపు చూసి కెవ్వున కేకపెట్టి, బాధగా మూల్గుతూ నేలమీదకు వాలిపోయాడు...

కాలకేయుడు భయంగా అరవడానికి కారణమేమిటో తెలుసుకోవాలని రూపకామిని కూడా సరస్సులోకి చూసింది. మొసళ్ళ మధ్య చిక్కుకున్న సుకుమార్ తీవ్రంగా పోరాడుతూ, అప్పుడప్పుడు వాటి నోళ్ళలో యిరుక్కుంటూ అతి ప్రయాసతో మళ్ళీ బయట పడుతూండడం గమనించిన రూపకామిని తల పంకిస్తూ "ఇంతటితో యితని పని సరి. యీ

సంగతి తెలుసుకుని జగదానంద యింత దూరం శ్రమపడి రాకుండానే అతని విషయం కూడా తేల్చుకుంటాను. నా 'రాజా'ను చంపిన దానికి ప్రతిఫలం పూర్తిగా రాబడతాను." అనుకుంటూ ముందుకు నడకసాగించింది.

# 35

చైతన్యరహితంగా పడివున్న జగదానంద నొకసారి తిలకించి విషనాగిని తన చూపును ఫణిరాజా మీదకు మరల్చింది. విషనాగిని మంత్ర ప్రభావానికి వశుడై ఫణిరాజా యింకా సర్పరూపంలో అలాగే వున్నాడు. ఆమె కొంతసేపు అతన్ని తీక్షణంగా చూసి నెమ్మదిగా ఏదో స్మరించింది. దానితో ఫణిరాజా యువక రూపాన్ని పొంది నాగిని ముఖంలోకి తీవ్రంగా చూడ్డం ప్రారంభించాడు.

అతని నేత్రాల్లోని ఎర్రదనాన్ని హృదయంలోని, క్రోధాన్ని కనిపెట్టి విషనాగిని నొసలు చిట్లిస్తూ, "నాగాధిపతీ - అత్యాచారానికి ఒడికట్టి, నియమోల్లంఘనం చేశావు. అందుకే నా మంత్ర శక్తితో నిన్నింతవరకు బంధించి వుంచాను. ఇప్పటికైనా సత్ప్రవర్తనతో మెలగడం మంచిది" అంది ఆవేశాన్నణచుకుంటూ.

ఫణిరాజా ఆమె మాటలను వినే స్థితిలో లేడు. అతను రెండడుగులు ముందుకు వేసి "నాగినీ, నీకు సహాయంగా నిలచిన వరుడు నేల కూలాడు. మళ్ళీ ఒంటరి దానవయ్యావు. ఎందుకనవసరంగా బాధపడతావు ఇప్పటికైనా మనసు మార్చుకుని నాకు అర్థాంగివై సుఖించు," అన్నాడు తెలియని మైకంతో.

నాగిని ఏమీ సమాధానం చెప్పలేదు.

"మాట్లాడవేం!" అన్నాడు ఫణిరాజా.

ఆమె మౌనంగానే వుండి పోయింది.

"నాకు సమాధానం కావాలి." ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు ఫణిరాజు.

"నేను చెప్పే జవాబు నీకు తెలుసు. నాగిని యీ మారు నిశ్చలంగా సమాధానం చెప్పింది.

"నీ వుద్దేశం కొంచెం కూడా మారలేదనుకుంటాను."

"ఆ సంగతి నేను చెప్పకుండానే తెలుసుకున్నందుకు సంతోషిస్తున్నాను." వ్యంగ్యంగా అంది నాగిని.

"హుఁ." అని హుంకరించాడు ఫణిరాజు.

నాగినిలో ఏమీ మార్పు రాలేదు. యెప్పటిలాగే స్థిరంగా నిలబడి వుంది.

"నాగినీ!" గర్జించాడు ఫణిరాజు.

"ఏం." కనుబొమ లెగరేస్తూ అతని ముఖంలోకి చూసింది నాగిని.

"నీకు అండగా నిలవదలచిన యీ నరుని దీనావస్థ చూసైనా వివేకంతో ప్రవర్తించడం అవసరం." ఫణిరాజు హెచ్చరిస్తున్నట్టు అన్నాడు.

"నా అవసరానవసరాలతో నీకేమీ నిమిత్తం లేదు, జయానంద చావు బ్రతుకులతో నీకేమీ సంబంధం లేదు. నీ హితోపదేశాలు వినడానికి నాకు తీరికకూడా లేదు. వెంటనే యిక్కడ నుండి వెళ్లిపో!" అంది విషనాగిని.

ఆమె అలా అంటూనే జయానందను సమీపించి, దగ్గరగా కూర్చుని, చేతితో శిరస్సును స్పృశించసాగింది.

అది చూసిన ఫణిరాజు ఆగ్రహావేశాలతో మరో రెండడుగులు ముందుకు వేసి "నాగినీ" అన్నాడు రోషంగా.

నాగిని మౌనంగా అతని వైపు చూసింది.

"చాలా మూర్ఖంగా ప్రవర్తిస్తున్నావు." ఉద్రేకాన్ని అణచుకుంటూ అన్నాడు ఫణిరాజు.

"నేనా !" వెంటనే ప్రశ్నించింది నాగిని.

"నువ్వు కాకుంటే, నేనా?"

"సేనాధిపతీ! ఎవరికి మూర్ఖత్వమో ఆత్మవిమర్శ చేసుకుంటే అర్థమౌతుంది."

"నాకు కావలసింది ఆత్మవిమర్శ కాదు; నీ అంగీకారం. మనసు మారుతుందని యిన్నాళ్లు ఎదురు చూశాను. కాలమంతా వృథా చేశాను. ఇక సహించడం దుర్భరం. నీ హృదయాన్ని నొప్పించకూడదనే తలంపుతో నన్ను నేను బలి చేసుకోలేను. ఇహ నీ సమాధానం కోసం కూడా ఎదురు చూడదలుచుకోలేదు. నీ యిష్టాయిష్టాలతో నాకేమీ నిమిత్తం లేదు. నిన్ను నేను విధిగా పెండ్లాడి తీరుతాను. నీ తండ్రి నాగరాజు కూడా మన వివాహానికి యిష్టపడ్డారు. కోరి కష్టాల నెందు కనుభవిస్తావు. యిప్పటికైనా నీ వుద్దేశాన్ని మార్చుకో." అన్నాడు ఫణిరాజు.

విషనాగిని అతని మాటలు శ్రద్ధగాను, శాంతంగాను వింది. ఆమె తల దించి జయానంద ముఖంలోకి చూస్తూ, ఫణిరాజు నుద్దేశించి "సేనాధిపతీ! ఒత్తిడి చేసి వశపరచుకోవా లనుకుంటున్నావు. అది నీకు చేతకాని పని." అంది నిర్మలంగా.

"నాగినీ!" గర్జించాడు ఫణిరాజు. తిరిగి అంతలోనే శాంతాన్ని వహించి "నాగినీ! ముళ్ళబాటమీద నడవడం, భయంకర ప్రదేశాల్లో విహరించడం, తెలిసుండి మృత్యువును కౌగలించుకోవడం మంచిది కాదు." అన్నాడు.

నాగిని నాగుబాములా తల పైకెత్తింది. "సైన్యాధిపతీ! నీ హెచ్చరికలోనున్న అంతరార్థాన్ని అర్థం చేసుకున్నాను. వీరవంశంలో పుట్టిన వాళ్ళకు విశ్రాంతి ఎలా లభిస్తుంది? సుఖం, సౌఖ్యం ఎక్కడ ప్రాప్తిస్తాయి? పౌరుషంగా బ్రతుకుతూ, వివేకంతో మెలగుతూ, అవసరమైతే మృత్యు

దేవతను ఆనందంగా ఆలింగనం చేసుకోగల శక్తి వీరవంశీయులకు పుట్టుకతోనే ప్రాప్తిస్తుందని తెలుసుకో. బెదరించి నా వుద్దేశాన్ని మార్చలేవు. భయపెట్టి నన్ను నీ దాన్నిగా చేసుకోలేవు. ఒక వేళ అలా నువ్వు భావిస్తే అది నీ తెలివి తక్కువే అని చెప్పాలి ... సేనాధిపతీ! ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచంలో వున్న శక్తులన్నీ ఏకమైనా నన్ను నీ ఎదుట తల ఒంచేలా చేయలేవు. నిన్ను నేను ఎంతో అసహ్యించుకుంటున్నాను. ఎల్లప్పుడూ అసహ్యించుకుంటాను. పౌరుషవంతుణ్ణని చెప్పుకుంటూ, పోరాటంలో సంభవించిన ఓటమిని అంగీకరించడానికి సిగ్గుపడ్డావు. జయానంద చేతుల్లో ప్రాణం పోతుందని భయపడి మోసం చేసి తప్పించుకున్నావు. తిరిగి అతన్ని అన్యాయంగా కాటువేశావు. జాతియొక్క పవిత్రతకే భంగం కలిగించావు. దొంగతనంగా దెబ్బ తీయడానికి సమకట్టి నీలోవున్న పిరికితనాన్ని బహిర్గతం చేసుకున్నావు. నువ్వింత నీచానికి తలపడతావనుకోలేదు. ఇంతటి దుర్బలుడవని తలచలేదు. రక్తంలో లేని పౌరుషం, హృదయంలో కనుపించని పృథుత్వం-మాటల్లో చూపిస్తే లాభంలేదు. బెదిరించి నా మనస్సును కదలించాలనుకోకు. అది నీకు సాధ్యపడని విషయం. చేతల్లో కనబడిన అసమర్థతను మాటలతో కప్పిపుచ్చాలనుకుంటున్నావు, పాపం! గర్జించినందువల్ల, గాండ్రించినందువల్ల ప్రయోజనం లేదు. దానివల్ల నీ తెలివి తక్కువ మాత్రం బయటపడుతుంది." అంది విషనాగిని వ్యథ స్వరంతో.

ఆమె మాటలు విన్న ఫణిరాజు "నాగినీ!" అన్నాడు గట్టిగా. అతని నోటినుంచి వచ్చిన శబ్దానికి ఆ ప్రదేశమంతా మారుమ్రోగింది. చుట్టూ వున్న గోడలు కంపించాయి.

కాని, విషనాగిని ముఖంలో ఎలాంటి మార్పు రాలేదు.

ఆమె శాంతాన్ని వహించి, బోధకురాలిలా నెమ్మదిగా యిలా అంది: "సైన్యాధిపతీ! గొప్పగొప్ప మునిపుంగవులు కూడా వూహించని విధానాన్ని అవలంభించావు. మోక్ష మార్గాన్ని యింత సులువుగా గ్రహిస్తావనుకోలేను. నిష్కల్మష హృదయంతో పిలిస్తే దేవుడు పలుకుతాడని విన్నాను. మళ్ళీ పిలు, అయితే 'నాగిని' అనడానికి బదులుగా 'నాగదేవా' అని సంబోధించు, యింతవరకు నువ్వు చేసిన పాపాలన్నీ తొలగిపోతాయి. స్వర్గలోకానికి మార్గం కనబడుతుంది. జీవితానికి ముక్తిలభిస్తుంది. అంతటితో నీ చేతలతోను, మాటలతోను విసుగెత్తిపోయిన నా హృదయానికి శాంతికలుగుతుంది."

"నాగినీ!" ఫణిరాజు కాలితో నేలను అదిమి తన్నాడు.

"ఎన్నిచేసినా నీకు నేను భయపడను, నీ అరుపులు నన్ను అదుపులో పెట్టలేవు. సేనాధిపతీ! భయపెట్టే ఉద్దేశాన్ని మార్చుకో. ఇక్కడనుండి వెంటనే వెళ్ళిపో. తిరిగి ఎన్నడూ యిక్కడకు రావడానికి ప్రయత్నించకు."

"నాగినీ! వూరకనే తిరిగిపోడానికి రాలేదు. నిన్ను మనసారా ప్రేమించాను. పెళ్ళికి ఒప్పించి వెడతాను" అని ఫణిరాజు క్రూరంగా చూస్తూ కొంచెం ముందుకు వచ్చాడు.

నాగిని రోషపూరిత వదనంతో లేచి నిలబడింది. తీవ్రంగా అతని కళ్ళల్లోకి చూసింది. "సేనాధిపతీ! సమాధానాలు చెపుతూంటే మాటలు పెంచుతున్నావు. నాకున్న మంత్రశక్తులతో నిన్నిప్పటికే అంతం చేసేదాన్ని. కాని. నాన్నగారికి నీయందుండే అభిమానాన్ని గుర్తించి అలా చేయలేకపోతున్నాను. నీ తండ్రి చనిపోయాక కన్నతండ్రిలా పెంచిన నాన్నగార్ని ఖైదులో పెట్టడానికి కూడా నువ్వు వెనకాడలేదు. ఉగ్గు పాలుపోసి ఉపచారాలు చేసిన దాదినే నీ కత్తికి బలిచేశావు. 'రాజకుమారిని వాంఛించడం తప్పా నాయనా' అనడమేగా ఆమె చేసిన నేరం! నన్నిచ్చి

వివాహం చేయకపోతే నాన్నగార్ని కూడా చంపుతానన్నావు. నువ్వు యింత నీచానికి తలపడ్డా, అన్యాయానికి పూనుకున్నా సహించి పూరుకుంటూంటే చేతకానితనం గా జమకట్టావు. జాగ్రత్త. మరోమారు నీ కంఠంలో అధికారదర్పాన్ని అను పరిస్తే గొంతుకను పాశబద్ధం చేస్తాను. నాలుకను బయటకు లాగి ముక్క ముక్కలుగా చీలుస్తాను. నీ ఎదుట రాజకుమారి నిలబడివుంది; నాగిని కాదు. నాగిని అన్న అక్షరాలు యిక నోటి నుంచి బయటకు రాకూడదు. సేనాధిపతి రాజకుమారికి యివ్వ వలసిన గౌరవాన్ని గుర్తుంచుకో. అడుగు ముందుకువేసినా, హద్దుమీరి మాట్లాడినా అంతటితో నీ జీవితం ఆఖరయి పోతుంది" అంది.

ఫణిరాజు ఎక్కడివాడక్కడే నిలబడిపోయాడు. "నా... రా..." అని పూరుకున్నాడు. తరువాత అక్షరాలు అతని నోటినుంచి బయటకు రాలేదు.

నాగిని అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ నిర్లక్ష్యంగా నవ్వింది. తర్వాత "సేనాధిపతీ! 'నాగిని' అనడానికి భయపడు తున్నావు; రాజకుమారి అనడానికి సిగ్గుపడుతున్నావు. నీ మనో దౌర్బల్యానికి జాలికలుగుతూంది!" అంది సానుభూతిగా.

"సిగ్గా, సిగ్గుపడ్డందేనికి—"

"నీ అవివేకానికి సేనాధిపతీ! పిచ్చిపట్టిన వాళ్ళలా తన వెంట పడ్డవాళ్ళను చూసి ఆడది అసహ్యించుకుంటుందని నీకు తెలియదు! వాంఛను తీర్చుకోవడానికి గాను తమ ఔన్న త్యాన్ని పొగుడుకుంటూ, ఉత్తములుగా నిరూపించుకోడానికి తాపత్రయపడే పురుషుల మనస్తత్వాలను స్త్రీ తేలిగ్గా అర్థం చేసుకుంటుందని, అట్టివాళ్ళ నామె ఏవగించుకుంటుందని నువ్వెరుగవు! - నీడను పట్టుకోవాలనుకుంటే దొరుకు తుందా? దొరకదు. అందుకు ప్రయత్నిస్తే, అది మూర్ఖత్వమే ఔతుంది. నీడ ఎప్పుడూ శరీరం వెంటే వుంటుంది. దానికి

స్త్రీ-పురుష భేదమేమీ లేదు. నువ్వు ముందుకు వెడుతూంటే అది నీతోపాటుగా నీ వెనకనే వస్తుంది. దాన్ని నువ్వు పట్టుకోడానికి సంకల్పించి వెనుదిరిగి పరుగెడితే, అది నీ చేతికి దొరక్కుండా, దూరంగా పోకుండా, అంటీ అంట నట్టు నీ ఎదుటే కనబడుతూంది. నువ్వెంత దూరం పరుగెత్తినా దాన్ని పొందలేవు. అది నీ దృష్టినుంచి తొలగదు. నీ చేతికి దొరకదు. జీవితం వున్నంతవరకు పరుగెత్తినా అది నీకు చిక్కదు—అయితే, దాన్ని పట్టుకోడానికి ప్రయత్నించకుండా, దానికోసం ప్రాకులాడకుండా, దానియందు నిర్లక్ష్య భావం వహించి ముందుకు పోతూన్న వాని వెంట అది వుంటూనే వుంటుంది. అతన్ని అనుసరిస్తూనే నీడ కూడా పోతుంది. అది ఎల్లప్పుడూ అతని వెనకనే వుంటుంది. అతను కదిలితే అది కదులుతుంది, అతను కూర్చుంటే అది కూర్చుంటుంది. అతను లేస్తే, లేస్తుంది. అతనేమి చేస్తే నీడ కూడా అదే చేస్తుంది. జీవితపు ఆఖరు ఘడియలవరకు అతన్ని అది విడిచిపెట్టదు. కష్టాల్లో—సుఖాల్లో—నిర్భర వేదనలో—మహానంద సమయాల్లో—ఎట్టి భేదం లేకుండా అతన్ని అంటిపెట్టుకునే వుంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే అతని శరీరం నాశనమయ్యేంతవరకు నీడ అతన్ని అనుసరించే వుంటుంది—ఒక్క క్షణం కూడా అతన్ని విడిచిపెట్టి వుండదు" అంది.

తర్వాత ఆమె జనానందనొకసారి ఆపాదమస్తకం నిదానించి మాని, మళ్ళీ తల పైకెత్తింది.

ఫణిరాజు మౌనం వహించి ఎప్పటిలాగే నిలబడి వున్నాడు.

నాగిని బలంగా వూపిరిపీల్చుకుని "సేనాధిపతీ! నే నన్న మాటల్లో వున్న అర్థం నీకు తెలిసిందా!... తెలియకపోతే చెపుతాను విను. ఆడది నీడతో సమానం. నిర్లక్ష్యభావంతో, తిరస్కార దృష్టితో, గమ్మంవైపు తల ఒంచుకు పోయేవాణ్ణే

స్త్రీ ప్రేమిస్తుంది. తన జీవితాన్ని అతనికి అర్పిస్తుంది. ఆత్మను-ఆత్మలో కలిపి తన వ్యక్తిత్వాన్ని మరచిపోతుంది. అతని సుఖాన్ని తన సుఖంగా భావించి, అతని కష్టాన్ని తన కష్టంగా తలపోసి చేతిలో చేయి కలుపుతుంది. సేనాధిపతీ! స్త్రీ ఎందుకలా చేస్తుందో నీకు తెలుసా? అతనిలో కనబడుతూన్న నిస్వార్థ భావంవల్లే, పురుషార్థ కారణంవల్లే ఆమె అతనికి దాసిస పోతుంది—

"ఇదంతా—కామంతో కళ్లుమూసుకుపోయి, వ్యామోహానికి వశీభూతులై, క్షణిక సుఖం కోసం నీతి నియమాలను విడిచి, స్త్రీ జాతికే కళంకాన్నాపాదించే కాముకుల గురించి చెప్పడంలేదు... యథార్థంగా అది కామం తప్ప, ప్రేమ అనిపించుకోదు. క్షణికానందాన్నిచ్చే కాముకతను, క్షణిక సుఖాన్నిచ్చే వ్యామోహానికి ప్రేమ అనే పదాన్ని జోడించి వ్యవహరించే వాళ్లను గురించి నేనీ మాటలు చెప్పడంలేదు. చెప్పలేను కూడా—ప్రేమ అనే వస్తువును ఆరాధిస్తూ పవిత్ర కానుకగా స్వీకరించి గౌరవప్రదంగా ఆరాధించే నిర్మల మూర్తులున్నారు—అట్టివారి నుద్దేశించి నేనీ మాటలు చెప్తున్నాను. వారికి—ఒకరిలో మరొకరికి లోకమంతా కనిపిస్తుంది. మహానందం లభిస్తుంది. సంతోషంతో శరీరాలు ఉప్పొంగిపోతాయి. హృదయాలు కలిసిపోతాయి. ప్రకృతి రమణీయకత వారి కళ్లముందు నిలుస్తుంది. పవిత్ర నది జలాల మీదనుంచి వచ్చే చల్లని పిల్లవాయువుల్లా ఒకరి కళ్లల్లోంచి ఉద్భవించిన కాంతిరేఖలు మరొకరి శరీరాలను తాకి మనస్సుకు హాయి నిస్తాయి. ఒకరియందు మరొకరికి అమితమైన విశ్వాస మేర్పడుతుంది. ఆ వ్యక్తుల్లో ఒకరికోసం ఒకరు త్యాగం చేయలేనిదంటూ వుండదు. ఏ ఒక్కరు లేకపోయినా యిద్దరూ లేనట్టే బాధపడతారు. ఎన్ని జన్మలెత్తినా వారి బాంధవ్యం చెడకుండా వుండాలని ప్రార్థిస్తారు. సేనాధిపతీ! ఆ పవిత్ర

మూర్తుల నిర్మలప్రేమకు ఎన్నో అవాంతరా లేర్పడతాయి. అడ్డులు తగులుతాయి. తుఫానులు రేగుతాయి. కాని, వాళ్లు కొంచెం కూడా చలించరు. ఒకరి కొకరు అండగా నిలచి దుష్టశక్తుల నెదిరించడానికి వెనుదీయరు. ఒకరిలో ఒకరు లీనమై అన్నిబాధలను అధిగమిస్తారు. విజయం కూడ విజయాన్ని సాధించుకుంటూ ముందుకుపోతారు. వాళ్లెటు చూసినా పూలబాటలే కనబడతాయి. చేయీ చేయీ కలిపి తీయని గీతాలాపన చేసుకుంటూ ఉల్లాసంతో, ఉత్సాహంగా అడుగులో అడుగు వేసుకుంటూ తుది గమ్యం వరకు సాగి పోతారు. పవిత్ర ప్రేమను అర్థంచేసుకున్న స్త్రీ పురుషుల జీవితకాలం సంతోషానందాలతో గడచిపోతుంది. అన్యుల కది సాధ్యంకాదు" అని కొనసాగింది.

ఆమె మాటలు వింటూన్న ఫణిరాజు చలన రహితునిలా అలానే నిలబడి వున్నాడు. చేతివ్రేళ్లు అతనికి తెలియకుండానే దగ్గరకు ముడుచుకొని విడిపోతున్నాయి.

ఫణిరాజు ముఖంలోని హావభావాలను గమనిస్తున్న నాగిని తిరిగిఅతని ముఖంలోకి చూసి "సేనాధిపతీ! ప్రేమ దౌర్జన్యానికి లొంగే వస్తువు కాదు. అధికార ఆడంబరాల ప్రభావం దాని మీద ఏమీ పనిచేయదు—సేనాధిపతీ! బలపరాక్రమాలతో రాజ్యాలను వశపరచుకోవచ్చు. దేశం తర్వాత దేశాన్ని వరుసగా జయించవచ్చు. ప్రపంచాధిపత్యం వహించవచ్చు. కాని,ఆ బలపరాక్రమాలు హృదయాల మీద అధికారం చేయడానికి మాత్రం ఉపయోగపడవు. ఒకవేళ దౌర్జన్యానికి పూనుకుని లొంగదీయడానికి ప్రయత్నించినా—అందులో నీకు సుఖం కనిపించదు, శాంతి లభించదు...పవిత్ర ప్రేమ ప్రతిబింబంలాంటిది. అద్దంముందు నిలబడితే అది నీ రూపంలో కనబడుతుంది. నీ మనస్సులోని నైర్మల్యాన్ని బట్టి అది నీముందు సాక్షాత్కరిస్తుంది. కలుషిత మనస్కులైన వాళ్ళ

కళ్ళు కది కనుపించనే కనుపించరు !...పురుషునికి స్త్రీ కావలసినట్టే, స్త్రీకి కూడా పురుషుని అవసరం ఎంతైనా వుంది. స్త్రీ పురుషుల కలయిక లేకుంటే సృష్టే లేదు !

"అయితే, సేనాధిపతీ! కామవాంఛతో వెంటాడుతూన్న పురుషుడు స్త్రీ దృష్టిలో చాలా హీనంగా కనబడతాడు - స్త్రీకి అతనియందు ఎలాంటి సానుభూతి వుండదు. మీదు మిక్కిలి అతన్ని అసహ్యించుకుంటుంది. కామవాంఛతో బరు వెక్కిన అతని కళ్ళను కాలిన శలాకలతో పెకలించాలను కుంటుంది. అయితే నిర్మల ప్రేమికుని కోసం ఆమె ఏమి చేయడానికైనా వెనుదీయదు.

"సేనాధిపతీ ! కామానికీ, ప్రేమకు, అంత తేడావుంది. కామం శరీరాన్ని వాంఛిస్తుంది; ప్రేమ హృదయాన్ని కోరు తుంది. హృదయాన్ని కోరే ప్రేమ ఎల్లప్పుడూ ఆత్మనే అంటి పెట్టుకుని వుంటుంది. దానికి శారీరక తృప్తి ప్రాధాన్యం కాదు. హృదయంలో హృదయం చొచ్చుకుపోయాక, ఆత్మను ఆత్మ ఆలింగనం చేసుకున్నాక పవిత్ర భావాలతో శరీరాలు కలవడంలోనే వుంది గొప్పతనం. అందులోనే వుంది నిజమైన ప్రేమ స్వరూపం. శాంతి, సౌఖ్యం, ఆనందం, సంతోషం అన్నీ అందులో యిమిడివున్నాయి...ఇహ కామవ్యామోహాలు భయంకర తుఫానులాంటివి. వాటిలో చిక్కుకున్న వాళ్ళెవరు బయటపడలేరు. బలం, పౌరుషం ముందే తొలగిపోతాయి. ఆత్మ విశ్వాసం అడుగంటిపోతుంది. వ్యక్తిత్వం నాశనమై పోతుంది. సంఘంలో గౌరవం అంతరించిపోతుంది. సమాజం ముందు తలెత్తుకు తిరగడం దుర్భరమైపోతుంది. అగచాట్లను, అవమానాలకు గురికావలసి వుంటుంది...సేనాధిపతీ ! ఒక్క సారి ఆత్మవిమర్శ చేసుకో. నీ ప్రవర్తనను దృష్టిలోకి తెచ్చుకో. అప్పుడు, నువ్వు నన్ను ప్రేమిస్తున్నావో, కామి

స్తున్నావో నీకే తెలుస్తుంది" అని అతని వంకే చూడసాగింది విషనాగిని.

ఫణిరాజు అలానే నిలబడి వున్నాడు. నాగిని మాటాడుతూన్నంత సేపూ అతని ముఖంలో రక-రకాల భావాలు కలుగుతూ వుండేవి. ఆమె మాట్లాడడం మానేసినా కూడా అతని ముఖంలో భావ పరంపరలకు అంతులేక పోయింది. అతని దృష్టి నాగిని మీదే వుంది. పెదాలు కదలడం లేదు. ఒక్క మాట మాట్లాడ్డం లేదు. వ్యగ్రతతో ఆమెనే చూస్తూ వుండిపోయాడు.

ఆ ప్రదేశాన్ని నిశ్శబ్దం ఆవరించింది. గంభీరత అలుముకుంది. నిశ్శబ్ద, గంభీరతలతో నిండివున్న ఆ స్థలంలో ఎప్పుడేమి జరుగుతుందో వూహించడానికి అలవికాకుండా వుంది.

[illegible] సమీపంలో నిలబడివున్న విషనాగిని కళ్ళు ఫణిరాజు మీదే వున్నాయి. ఆమె కళ్ళల్లో భయంగాని, తొట్రుపాటుగాని నామ మాత్రానికైనా కనబడ్డం లేదు. ప్రశాంత గంభీరవదనంతో ఫణిరాజునే తిలకిస్తూందామె.

ఫణిరాజు ఆమె కెదుటనే నిలబడివున్నాడు. అతను కూడా నాగినివైపే చూస్తున్నాడు. కాని, మనసులో ఉత్పన్నమై తొలగిపోతున్న భావాలతోపాటు అతని కళ్ళల్లోను అనేక మార్పులు వస్తున్నాయి.

మౌనముద్ర వహించి ఒకరి నొకరు చూసుకుంటున్న ఆ యిద్దరి హృదయాల్లో ఎట్లాంటి తుఫాను రేగుతూందో, ఎంతటి భయంకరపు టాలోచనలు దొర్లుతున్నాయో ఊహించడానికి అలవికాకుండా వుంది. అప్పటి ప్రశాంత వాతావరణం ఎంతో భీతిని గొల్పుతూంది. ప్రతి క్షణంలోనూ ప్రళయం ముంచుకొస్తూన్నట్లే అనిపిస్తూంది.

ఫణిరాజు ముఖంలో కనబడిన వ్యాకులపాటు చూస్తూండగానే పెరిగిపోయింది. అతని శరీరంలో కదలిక ఏర్పడింది.

క్రమక్రమంగా అతనా గదినంతా కలయతిరగడం మొదలు పెట్టాడు. అతని ముఖంలోకి వచ్చి-పోతూన్న భావాలకు అంతులేకుండా వుంది. ఎంత ప్రయత్నించినా అతనొక నిర్ణయానికి రాలేకపోతున్నాడు.

ఉభయుల మౌనంతోను ఆ గదిలోని వాతావరణం క్షణం క్షణానికి భయంకరంగా మారిపోతూంది.

కొంతసేపలా గడిచింది.

నాగిని యింకా అలానే నిలబడివుంది. లోపల రగులుతూన్న అగ్నిజ్వాలను పైకి రానీయకుండా ప్రయత్నిస్తూందామె.

మరికొన్ని క్షణాలు గడిచాయి.

నాగిని యింకా కలయతిరుగుతూన్న ఫణిరాజును తిలకించ సాగింది. అతని ముఖంలో కనబడుతూన్న మార్పులను బట్టి మనస్సులో కలుగుతూన్న భావాలను తెలుసుకోడానికి ప్రయత్నించ సాగింది. అయితే, ఆమెలోని శాంతి, గంభీరాలు ముసుగుపడలేదు. అవి రెండూ మామూలుగా ఆమె వదనానికి శోభనిస్తూనే వున్నాయి.

ఫణిరాజు అకస్మాత్తుగా ఆగిపోయాడు. అతని ముఖంలోని వ్యగ్రత తొలగిపోయింది. క్రమక్రమంగా అతనొక నిశ్చయానికి వచ్చాడు. ముఖంలో గాంభీర్యం అలుముకుంది. అతను నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి-విరిగిపోయి క్రిందపడివున్న తన ఖడ్గాన్ని తీశాడు. దాన్ని చేత్తో గట్టిగా పట్టుకుని ఒకసారి బాగా పరిశీలించి ఒరలో పెట్టాడు. తర్వాత వెనక్కి తిరిగి విషనాగిని దగ్గరకు నడవసాగాడు.

విషనాగిని అదంతా చూస్తూనే వుంది. ఆమెలో ఆత్రుత గాని, ఆందోళనగాని ఏమీ కనిపించడం లేదు. తనను సమీ

వీక్షిస్తున్న ఫణిరాజా ముఖంలోకి నిశ్చలంగానూ, నిర్భయంగానూ చూస్తూ వుండిపోయింది.

ఫణిరాజా ఆమెను సమీపించాడు. దగ్గరకు రాగానే అత నామె ముఖంలోకి గంభీరంగా చూశాడు. అలా చూస్తూనే కత్తిపిడిమీద చెయ్యివేశాడు. మరుక్షణంలో అది ఒరనుండి బయటపడింది. విరిగిన ఖడ్గం ఫణిరాజా చేతిలో తళతళ్ళాడ సాగింది.

అయితే, నాగిని - ఫణిరాజా ప్రవర్తన చూసి చలించలేదు. అతని చేతిలోని ఖడ్గాన్ని చూసి భయపడలేదు. ఆమె ఎప్పటిలా స్థిరంగా నిలబడివుండి ఫణిరాజా ముఖం లోకి తీవ్ర దృక్కులను బరపసాగింది. క్రోధంతో ఎరు పెక్కిన ఆమె కళ్లు వేడి గాడ్పులను వెలువరిస్తున్నాయి. హృదయంలో తీవ్రమైన సంచలనం కలగడం వల్ల సూక్ష్మంగా వెనక్కి ముందుకి వూగసాగింది.

అప్పుడు ఆమె రూపం సాక్షాత్తు దుర్గను గుర్తుకు తెస్తుంది. అయితే ఆమె చేతిలో ఆయుధం మాత్రం లేదు. కానీ, ఆమె కళ్ళల్లోంచి వచ్చేజ్వాలే ఎంతటి వాళ్ళనైనా భస్మం చేయ డానికి సరిపోయేలా అగుపడుతూంది.

ఒక వైపున కత్తి చేతపట్టిన ఫణిరాజా! మరోకవైపున కళ్ళ నుండి అగ్నిని క్రక్కుతూన్న విషనాగిని!!...

నిశ్శబ్దవాతావరణం! భయంకర సన్నివేశం!!

ఫణిరాజా క్షణకాలం నాగిని ముఖంలోకి నిశ్చలంగా చూశాడు. అదే సమయంలో ఆమె అతన్ని ఆపాదమస్తకం పరిశీలనగా చూసింది.

అంతలోనే ఫణిరాజా మోకాళ్ళమీద క్రిందకు ఒంగాడు. అది గమనించిన నాగిని ఒక్క అడుగు వెనక్కి వేసింది. ఫణి రాజా తన చేతిలోని ఖడ్గాన్ని ఆమె పాదాలముందు పెట్టాడు. నాగిని కనురెప్పలను బలంగా మూసి, తెరచింది. దారుణ

శాపంతో మండిపోతున్న ఆమె కళ్ళనుండి రెండు నీటిబిందువులు రాలి ఫణిరాజా తల మీద పడ్డాయి. అతను తలపైకెత్తి ఆమె ముఖంలోకి చూశాడు. నాగిని వాత్సల్యపూరిత దృష్టిని అతని మీద బరిపింది.

"దేవీ" అన్నాడు ఫణిరాజా.

నాగిని సమాధానం చెప్పలేదు.

"దేవీ! క్షమించు. అంధకారంలో దారి తప్పి అగాధంలో కూలిపోతున్న నన్ను హెచ్చరించి మేల్కొలిపావు, వెలుతురును చూపావు, నావ్యక్తిత్వాన్ని నిలిపావు, గౌరవాన్ని కాపాడావు. నాకు అంటబోతున్న పాపాన్ని దూరంగా తరిమావు. నీకు నేను సర్వదా కృతజ్ఞుడ్ని...దేవీ! అపరాధం చేశాను. నీ హృదయాన్ని చాలా బాధపెట్టాను. మహారాజును కష్టాల పాలు చేశాను...ఇదిగో ఖడ్గం—దీనితో నా అపచారానికి దండన విధించు. ఆనందంగా అనుభవిస్తాను." అన్నాడు ఫణిరాజా.

ఫణిరాజాలో కలిగిన పరివర్తన, అతని మాటల్లో కనబడుతూన్న పశ్చాత్తాపం - విషనాగిని హృదయంలో జ్వలించిన అగ్నిని చాలా వరకు చల్లార్చాయి.

ఆమె కాసేపు ఫణిరాజా కళ్ళల్లోకి చూస్తూవుండి పోయింది. తర్వాత "సేనాధిపతీ! తప్పులు అందరూ చేస్తారు. తెలియక చేసిన తప్పును గుర్తించి, మళ్ళీ అలాంటి తప్పులు చేయకుండా వుండడంలోనే వుంది గొప్పతనం. జరిగిన పొరపాటుకు పశ్చాత్తాపం చెందడమే పెద్ద శిక్ష. దానికంటె మించిన దండన లేదు. పైకి లేవండి." అంది విషనాగిని - మృదువుగా.

ఫణిరాజా లేవలేదు. దీనంగా ఆమె ముఖంలోకి చూస్తూ "రాజకుమారీ! నేను క్షమకు అర్హుణ్ణి కానా? నన్ను క్షమించలేవా? నా జీవితకాలంలో మళ్లీ యిలాంటి నీచానికి ఒడిగట్టనని నాగదేవుని సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను.

చేసిన అపరాధానికి నన్ను మన్నించి, క్షమించమని వేడుకుంటున్నాను." అన్నాడు ఫణిరాజు.

ఫణిరాజు నోటినుండి వచ్చిన దీనపూరితవాక్యాలు నాగిని హృదయాన్ని కదలించివేశాయి. మనస్సులో అణిగిమణిగివున్న ఆగ్రహాన్ని పూర్తిగా అంతరింపజేశాయి. ఆమె వదనం ప్రశాంతంగా మారిపోయింది. చిరునవ్వును చిందిస్తున్న పెదాలను కదుపుతూ "సేనాధిపతీ! నా నోటినుండి మీరామాటలు వినాలనుకుంటే - క్షమించానంటున్నాను. లేవండి" అంది విషనాగిని.

ఆమె ఆ మాట అనగానే ఫణిరాజు లేచి నిలబడ్డాడు. రెండుగులు వెనక్కి వేసి వినయంగా ఆమె ముఖంలోకి చూడసాగాడు.

విషనాగిని - ఫణిరాజు తన పాదాల ముందు విడిచిపెట్టిన కత్తిని తీసి అతని కందిస్తూ "దీన్ని తీసుకోండి." అంది.

ఆమె అన్న మాటలోని భావాన్ని ఫణిరాజు గుర్తించాడు. ఆమె సౌజన్యానికి మురిసిపోయాడు. ఎంత అక్రమానికి తలపడ్డా, ఎన్ని బాధలు కలిగించినా ఆమెకు తనయందున్న గౌరవభావం తొలగిపోనందుకు కృతజ్ఞతతో తల వంచాడు. రెండు చేతులతోను ఖడ్గాన్ని అందుకుంటూ "రాజకుమారీ! నీ ఔదార్యాన్ని ఎన్నడూ మరచిపోను. నువ్వు చెప్పిన గుణపాఠాన్ని మరపురాని విధంగా హృదయంలో పెట్టుకుంటాను" అన్నాడతను భక్తిపూర్వకంగా.

"మీ నిశ్చయానికి చాలా సంతోషిస్తున్నాను." అంది విషనాగిని - ప్రసన్నవదనంతో.

ఫణిరాజు - జయానంద వైపు చూసి "రాజకుమారీ! యితని శరీరం యధారూపాన్ని పొందుతూంది. రక్తంలో కలిసిన విషప్రభావం తొలగిపోతూంది. తగిన వుపచర్యలు చేస్తే

తొందరలోనే తెలివి కలుగుతుంది. మీరందుకు పూనుకోండి. నేనింతలో మహారాజును తీసుకువస్తాను." అన్నాడు.

"తొందరగా వెళ్లి రండి. నాన్నగారి రాకకోసం ఎదురు చూస్తుంటాను." అంది విషనాగిని-జయానందను పరీక్షిస్తూ.

విషనాగిని అన్న మాటలను ఆజ్ఞగా స్వీకరించిన ఫణిరాజు వెంటనే అక్కడనుండి వెళ్లిపోయాడు.

# 36

జయానంద దగ్గరకు చేరిన విషనాగిని సర్పాకారాన్ని దాల్చి, తన శిరస్సునున్న మణిని అతని శరీరానికి తాకించడం ప్రారంభించింది. మణి ప్రభావంవల్ల - జయానంద శరీరంలో ప్రవేశించిన విషమంతా పూర్తిగా హరించి పోయింది. అతనిలో కదలిక ఏర్పడింది. నెమ్మదిగా అతను కళ్ళు విప్పి చూశాడు. సర్పరూపంలోనున్న నాగిని తనకు సమీపంలో వుండటం గమనించాడు. అనుమానంగా గదినంతా ఒకసారి కలయ చూశాడు. అతనికా గదిలో మరెవ్వరూ కనబడలేదు. ఆలోచనలో మునిగిపోయిన జయానందకు ఒక్కొక్క విషయం గుర్తుకొస్తూండగా విషనాగిని యథారూపాన్ని పొంది "జయానందా! నెమ్మదిగా లేచి తల్పం దగ్గరకు రా." అని తన చేతులతో లేవదీసి తల్పంమీద పడుకబెట్టి "యిప్పుడే వస్తాను" అంటూ బయటకు వెళ్లింది.

ఒంటరిగా వున్న జయానందకు ఒక్కొక్కటిగా అన్ని విషయాలు జ్ఞాపకం వచ్చాయి. ఫణిరాజుతో పోరాడ్డం, మోసంచేసి అతను తనను కాటువేయడం, తను ప్రాణాలు కోల్పోతున్న చివరి సమయంలో విషనాగిని కూడా తనను కరవడం- యివన్నీ గుర్తుకు వచ్చి అతని హృదయాన్ని కదలించి వేశాయి.

అతనికి విషనాగిని తనను కరవడానికి కారణం కనబడలేదు.

ఆమె అలా ఎందుకు చేసిందో అతనికి అర్థం కాలేదు. కాటు మీద కాటువేసిన నాగిని మళ్ళీ తనకు ఉపచర్యలు చేయడంలో వున్న రహస్యమేమిటో అతనికి బోధపడలేదు. ఏమైనా అది రహస్యమే! ఆమె వల్లే ఆ పరిష్కారం కావాలనుకున్నాడు జయానంద.

అంతలో నాగిని పాలగ్లాసుతో అతని ముందు ప్రత్యక్షమయింది ఆమె అతనికి దగ్గరగా నిలబడి "ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావు." అంది కనుబొమలాడిస్తూ.

జయానంద ఆమె ముఖంలోకి పరిశీలనగా చూస్తూ "నీనా!" అన్నాడు.

"మరి నే నాలోచిస్తున్నానా!" అంటూ విషనాగిని ఫక్కున నవ్వింది.

నిష్కల్మషంగా నవ్వుతూన్న ఆమె నిర్మలమైన ముఖంలో 'ఎందుకు నన్ను అనుమానిస్తావు? నిన్ను విడిచి నేను బ్రతుకగలనా!' అనే భావం ప్రస్ఫుటంగా కనబడుతూంది.

అయితే సందిగ్ధావస్థలోనున్న జయానంద ఆ విషయాన్ని గమనించలేకపోయాడు. ఆమె అన్నమాటకు సమాధానంగా "వెనక ముందులు ఆలోచిస్తే ఎందుకు కరుస్తావు. విజయుండైన ఫణిరాజుకు ఎదురు తిరగకూడదనుకున్నావు. అతని అభిమానాన్ని సంపాదించడం మంచిదనుకున్నావు. అందుకే అతను కరవగానే నువ్వూ కాటువేశావు." అన్నాడు నిష్ఠూరంగా.

విషనాగిని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె హృదయం దుఃఖంతో బరువెక్కింది. కాసేపటివరకు ఆమె నోట మాట రాలేదు. చివరకు "జయానందా! నన్ను పొరపాటుగా అర్థం చేసుకున్నావు! నేను కాటువేయడంవల్ల నీకు బాధ కలిగింది. నిజమే, కాని, నేను నీకు అపకారం తలపెట్టలేదు. నిన్ను ప్రాణాపాయాన్నుంచి కాపాడ్డానికే అలా చేశాను. నిన్ను రక్షించుకోడానికే కాటు వేశాను. కాటువేసి - ఫణిరాజు

నీ రక్తంలో ప్రవహింపజేసిన విషాన్ని బయటకు లాగాను. నేను చేసిన పని నేరమైతే నీ యిష్టం వచ్చిన దండన విధించు. అనుభవిస్తాను." అంది విషనాగిని - బాధగా.

జయానందకు ఆమె పల్కులు యదార్థంగానే తోచాయి. అయినా తన భావాన్ని బహిర్గతం కానీయకుండా, పరీక్షిస్తున్నట్టు ఆమె కళ్ళల్లోకి చూడసాగాడు.

విషనాగిని కళ్ళనుంచి రాలుతూన్న నీటి బిందువులు కపోలాల మీదనుంచి జారి వక్షం మీద పడుతున్నాయి. ఆమె బలంగా నిట్టూర్చి, "జయానందా! ఈ పాలు తీసుకో, నీకు తిరిగి యధాశక్తి కలుగుతుంది" అంటూ గ్లాసును అతని చేతికిచ్చింది.

అతను పాలను త్రాగుతూ "దేవి! నా కెందుకింత సేవ చేస్తున్నావు?" అన్నాడు ఆలోచనగా.

"ఇష్టదేవతను పూజించడం తప్పా" విషనాగిని నోటినుంచి ఆ మాటలు అప్రయత్నంగా బయటకు వచ్చాయి. ఆ సమయంలో అశ్రుపూరితమైన ఆమె నేత్రాలు కాంతితో మెరిశాయి.

నాగిని అలా అనడంతో అంతవరకు జయానందను పీడిస్తున్న అనుమానాలు, ఆలోచనలు అన్నీ ఒక్కసారిగా తొలగిపోయాయి. జయానంద గ్లాసును నాగినికి యిచ్చి, ఊహించని విధంగా ఆమెను సందిట నిముడ్చుకుని తల్పం మీద కూర్చుండబెట్టాడు. ఆమె చెంపలను మృదువుగా నిమురుతూ "నాగినీ! నిన్ను జీవిత సహచారిణిగా పొందగలిగేవాని భాగ్యానికి ఈర్ష్యపడ్డాను. కాని, ఆ అదృష్టం నాకే కలిగింది" అన్నాడు.

"ఇప్పు డెవరిమీద యీర్ష్యపడతావు!" నాగిని అతని వక్షం మీదకు వాలుతూ అడిగింది.

నాగిని కళ్ళల్లో కనబడుతూన్న కాంతి జయానంద హృదయాన్ని గిలిగింతలు పెట్టింది. ఆమె శరీరపు పొందిక అతన్ని తన్మయుణ్ని చేసింది. మాటల తీరు. చేతల పద్ధతి అతని మనస్సును కట్టుబాటునుండి తప్పించాయి.

"నాగినీ!"అంటూ తన హృదయం మీద వ్రాలిన నాగినిచి-చుట్టూ చేతులు పెనవేసి బలంగా గుండెలకు అదుముకుని గాఢాలింగనం చేసుకున్నాడు జయానంద.

నాగిని ఏమీ అడ్డు చెప్పలేదు. మత్తెక్కిన కళ్ళతో ఆప్యాయంగా జయానంద ముఖంలోకి చూస్తూ వుండి పోయింది.

ఇద్దరకూ తెలియకుండా, క్షణం తర్వాత క్షణం - ఎన్నో క్షణాలు గడిచిపోయాయి.

జయానంద తన రెండు చేతులతోను నాగిని .కపోలాలను సున్నితంగా తాకుతూ మైమరచిన ఆనందంతో "నాగినీ!" అన్నాడు. నాగిని శరీరం లోపలి రక్తం ఉద్రేకంతో ఉడికి పోతూంది. వేడెక్కిన ఆమె శరీరావయవాలు జయానంద హృదయానికి ఎంతో చల్లదనాన్నిస్తున్నాయి. అంతటి ఆనందాన్నే నాగిని కూడా అనుభవిస్తూంది.

జయానంద నోటినుంచి వచ్చిన పిలుపు విన్న నాగిని బరువెక్కిన కనురెప్పలను పైకి విసరుతూ వాత్సల్య పూరితంగా అతని కళ్ళల్లో కళ్లుపెట్టి "ఏం" అంది.

అతనేమీ మాట్లాడలేదు. ఎరుపెక్కిన ఆమె కపోలాలను, కాంతి పుంజాలను వెదజల్లుతూన్న ఆమె కళ్ళను చూస్తూ వుండిపోయాడు జయానంద.

అది గమనించిన నాగిని "ఏం మాట్లాడవేం" అంది.

"మాట్లాడాలనే అనుకుంటున్నాను. కాని, ఏం మాట్లాడాలో తెలియడంలేదు." జయానంద ఆలోచిస్తూ అన్నాడు.

"అలాగా !"

"ఔను, నాగినీ! నువ్వు నాగకన్యవు, నేను నరుణ్ణి. మన కలయికకు ఎన్ని అవాంతరా లొస్తాయో అర్థంకాకుండా వుంది."

"నాగకన్యను వివాహం చేసుకోడానికి మీ నరజాతి యిష్టపడదా, జయానందా?" అమాయకత్వాన్ని నటిస్తూ అడిగింది నాగిని.

జయానంద ఏమీ మాట్లాడలేదు.

నాగిని మెల్లిగా నవ్వి "జయానందా! జాతులకు మనం చాలా దూరంగా వున్నాం. ఆ జాతుల ప్రభావం మనమీద ఏమీ పనిచేయదు. ముఖ్యంగా నావరకూ రాదు...రాతి బండలా వుండే నా గుండె నిన్ను చూడగానే కరగి నీరైంది. నీ పరాక్రమం నన్ను ముగ్ధురాల్ని చేసింది. నీ రూపం నా హృదయంలో హత్తుకుపోయింది. నన్ను నీ ప్రేమపాశంతో బంధించావు. బాహువుల్లో యిముడ్చుకుని గాఢాలింగనం చేసుకున్నావు. శరీరాలు అంటుకుపోయాయి. హృదయాలు కలిసిపోయాయి. యిహ మనిద్దరిలో భేదమేముంది! నువ్వే-నేను, నేనే నువ్వు. యితర లోకాలతో మనకు నిమిత్తమే లేదు. ఆలోచనలు విడిచిపెట్టి ఆనందాన్ననుభవించు" అంది మృదువుగా.

జయానంద సంతోషానికి మేరలేకపోయింది. అతను నాగినిను బలంగా కౌగలించుకుంటూ "నాగినీ!" అన్నాడు కళ్లు మూసుకుని.

అందుకు సమాధానంగా "ఎక్కడకూ పోలేదు. నీబాహువుల్లోనే యిరుక్కుని నలిగిపోతున్నాను" అంది నాగిని.

"ఎల్లప్పుడూ యిలాగే వుండిపోతే ఎలా వుంటుంది!"

"చాలా హాయిగా వుంటుంది! ఆ సుభఘడియల కోసమే ఎదురు చూస్తున్నాను" అంది నాగిని.

జయానంద కళ్లు తెరచి నాగిని ముఖంలోకి చూశాడు. నాగిని అతని ముఖంలోకే చూస్తోంది.

ప్రణయాజీవుల ప్రేమ చూపుల మధ్య, కొంతసేపు ఆగిన వింత కాంతులలో వెలిగిపోయింది. ఆమె చూపు అతన్ని వివశుడ్ని చేశాయి. ఒళ్లు తెలియని మైకంతో అత నామె పెదవులకు తన పెదవులను తాకించి గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

అకస్మాత్తుగా జరిగిన ఆ సంఘటనకు విషనాగిని ఉగ్ర రూపాన్ని దాల్చింది. ఆ శరీరాన్ని పెనవేసుకొని వున్న అతని చేతులను విడలించి, కౌగిలినుంచి తప్పించుకుంది. తల్పం మీంచి లేచి, దూరంగా పోయి నిలచింది.

అంతలోనే ఆమె ప్రవర్తనలో కలిగిన మార్పుకు జయానంద ఆశ్చర్యపోయాడు. అందుకుగల కారణాన్ని గుర్తించలేక, ఏమనడానికీ తోచక ఆమె ముఖంలోకే చూడసాగాడు.

క్రోధంతో కంపించిపోతున్న నాగిని కొంతసేపటికి శాంతించి "జయానందా ! క్షమించరాని అపరాధం చేశావు" అంది-దిగులుగా.

"నేనేమి అపరాధం చేశాను నాగినీ!" జయానంద సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు.

"ఏమి అపరాధం చేశానని నెమ్మదిగా అడుగుతున్నావా! వివాహానికి ముందు అధర చుంబన నిషేధమని నీకు తెలియదూ ? మా దేశంలో ఇంతకంటె పెద్ద నేరం మరొకటి లేదు. సామాన్య కన్యలు కూడా పెండ్లికి ముందు యీలాంటి నీచానికి ఒడంబడరు...పురుషులు కూడా అంతే..."

"అయితే, నేను చేసింది అపరాధమే" జయానంద జరిగిన పొరపాటుకు పశ్చాత్తాప పడుతూ అన్నాడు.

"ఔను, మా దేశ చట్టాన్ననుసరించి, నువ్వు చేసింది మహాపరాధంగా ఎంచబడుతుంది."

"దీనికి శిక్షేమిటి?"

"మరణదండన... అయితే, అందుకు గురయిన యువతి మహారాజు దగ్గర ఆ విషయాన్ని వ్యక్తం చేయాలి. విచారణలో నేరం నిరూపించబడితే దండన తప్పదు."

"నువ్వు నామీద నేరారోపణ చేస్తావా?"

"చేయను."

"ఏం?"

"అదికూడా చెప్పాలా-అయితే చెప్తాను విను. నువ్వు భూలోకవాసివి- ఈ రహస్యాలు నీకు తెలియవు. ఇహ రెండవది...నువ్వు నన్ను మోసం చేయవని పూర్తిగా నమ్మకముంది."

"నామీద నీకంత నమ్మకముందా!"

"ఔను. నా నమ్మకం ఎన్నడూ పోదు."

"ఒకవేళ నేను మోసంచేస్తే..."

నాగిని జయానంద కళ్ళల్లో కళ్ళుపెట్టి క్షణసేపు నిశితంగా చూసింది. "నీవల్ల నాకు అపకారం జరగదు. నువ్వు నన్ను మోసం చెయ్యవు. ఒకవేళ చేయాలనుకున్నా చేయలేవు" అంది చిరునవ్వు ముఖంతో.

ఆమెకు తనయందేర్పడిన అచంచల విశ్వాసాన్ని గుర్తించిన జయానంద సంతోషంగా ఏదో అనబోతూండగా-నాగరాజు, అతని వెనకనే ఫణిరాజు గదిలో ప్రవేశించారు.

"నాన్నా" అంటూ విషనాగిని నాగరాజును చుట్టుకుపోయింది. నాగరాజు ఆమె శిరస్సును ఆప్యాయంగా నిమురుతూ. "కారణ జన్ముడైన మానవుని వల్ల మన కష్టాలు తీరతాయని, అతనితోనే నీకు వివాహం జరుగుతుందని ఒక సిద్ధుడు నాకు చెప్పాడు తల్లీ. అనుదినం యిప్పటికి ప్రాప్తించింది. ఫణిరాజు హృదయంలో మార్పుకలిగింది. మూడేళ్ళ తరువాత మనం మళ్లీ కలుసుకున్నాం." అని అతను జయానం

డను చూసి "నాయనా! ఫణిరాజు నాకంతా చెప్పాడు. నీ బలపరాక్రమాలకు చాలా సంతోషిస్తున్నాను. వీరుడవైన నీ ప్రేమకు పాత్రురాలయిన నాకుమార్తె అదృష్టవంతురాలు. నాగదేవుని ఆలయంలో యిప్పుడే మీ వివాహానికి ఏర్పాట్లు చేయిస్తాను." అన్నాడు.

అందుకు సమాధానంగా జయానందు ఏదో చెప్పబోతూండగా నాగిని అడ్డువచ్చి—"నాన్నా! ఆపదనుండి కాపాడిన జయానంద కోరిక ఏమిటో ముందుగా తెలుసుకోవడం మంచిదేమో." అంది సిగ్గుతో తల వంచుకుని.

"ఔనమ్మా! బాగా గుర్తుకు తెచ్చావు... అయినా వివాహము తర్వాత కదా కోరికలు తీర్చడం యిప్పుడే ఏమి తొందర వచ్చింది." అన్నాడు నాగరాజు.

"మన్నించండి, నాగరాజా! మీ మాటను పాటించలేక పోతున్నందుకు విచారిస్తున్నాను. మాదేశపు రాకుమారి జయశ్రీ, చంపక దేశపు రాజకుమారుడు సుకుమారుడు స్వయంవర వేదిక మీదనుండగా గద్దకుంచేరి అపహరించబడ్డారు. ఆ యిద్దరినీ విడిపించకుండా నేను వివాహం చేసుకోలేను." అని, జయానందు జరిగిన విషయమంతా వివరంగా చెప్పాడు.

నాగరాజుతోపాటు ఫణిరాజు కూడా జయానంద చెప్పుతున్నంతసేపు కుతూహలంగా విన్నాడు. అతను నాగరాజును చూసి "మహారాజా!" అని ఏదో చెప్పబోతూండగా ఒక వృద్ధుడు వచ్చి అక్కడ నిలచాడు.

నాగరాజు అతన్ని చూడగానే సాష్టాంగపడి పాదాలకు నమస్కరించి "మహానుభావా! మీ దీవెన ఫలించింది. నేటికి మాకు విముక్తి కలిగింది. కాని, యీ యువకుడు మా నాగినిని వివాహం చేసుకోడానికి ఏదో అభ్యంతరం చెప్తున్నాడు" అన్నాడు దీనంగా.

"నాగరాజా! అందుకు విచారించవలసిన పనిలేదు.

ఉత్తమ కులంలో జన్మించిన జయానంద అడినమాట తప్పడు. అతను తప్పకుండా విషనాగినిని వివాహం చేసుకుంటాడు అయితే, కార్యార్థియై బయలుదేరిన జయానందకు సహాయం చేయవలసిన బాధ్యత మీకెంతైనావుంది. విషనాగినిని అతని వెంట పంపించు" అన్నాడు సిద్ధుడు.

సిద్ధుని మాటలు విని నాగరాజా సందిగ్ధావస్థలో పడి "మహాత్మా..." అన్నాడు.

"నాగరాజా! మూడు కాలాలూ తెలిసిన మాకు నువ్వేమీ తెలియజేయవలసిన పనిలేదు. వివాహం కాకుండా నీ కుమార్తెను పరపురుషుని వెంట పంపించడానికి సంకోచిస్తున్నావు, నాకు తెలుసు. కాని, జయశ్రీ-సుకుమార్‌లకు వివాహం కాని జయానంద పెండ్లిచేసుకోడు. అతని దీక్ష అట్టిది!... గ్రహపాటమి అనుకూలంగా వున్న జయశ్రీ సంతం అశపు సైన్యస్థితి కూడా కిరణ్ బయలుదేరింది. ఆమె గురించి ఆలోచించవలసిన అవసరంలేదు. కాని, సుకుమార్ చాలా ప్రమాదావస్థలో వున్నాడు. అలక్ష్యంచేస్తే పరిస్థితులు విషమిస్తాయి. ఆ రాత్రి గడిచిపోయినట్లయితే ప్రయోజనం ఉండదు" అన్నాడు సిద్ధుడు.

సిద్ధుని మాటలు విన్న జయానంద భయాందోళనలతో కంపించిపోయాడు. అతను యోగి పాదాలమీద వాలిపోయి "మహాత్మా! సుకుమార్ లేకుంటే జయశ్రీ బ్రతకదు. ఆ ప్రేమికులు లేకుంటే నా జీవితం నిలువదు. దయచేసి నన్ను మీ యోగశక్తితో సుకుమార్ దగ్గరకు చేర్చండి. నా ప్రాణాలను ధారపోసైనా అతన్ని కాపాడతాను" అంటూండగా జయానంద గొంతుక బొంగురు పోయింది.

సిద్ధుడు జయానందను లేవదీసి "భయపడకు నాయనా, నీకు మేలు కలుగుతుంది" అని నాగరాజా అనుమతికోసం ఎదురు

చూడకుండానే విషనాగినిని జయానంద ప్రక్కకుజేర్చి, తన అరచేతిని ఆమెకు చూపించాడు.

సిద్ధుని చేతిలంక చూసిన విషనాగిని, భయకంపితయై జయానందను గట్టిగా పట్టుకుంది. అంతలోనే సిద్ధుడు తన కమండలంలోని జలాన్ని ఆ యిద్దరిమీదా జల్లాడు. మరుక్షణంలో జయానంద విషనాగినులు అదృశ్యమైపోయారు! అది చూసి నాగరాజు ఫణిరాజులు కంపించిపోతూండగా సిద్ధయోగి అట్టహాసంగా నవ్వుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు!!

# 37

త్రిలోక సైనికులు బల్లాలు చేతబట్టి ఆక్రమిస్తూవుండగా—

ప్రదీప్ అన్నమాటలు విన్న కిరణ్ చేతి మణికట్టును నాకి చూసుకుంటూ, "యోగీంద్రుడు యిచ్చిన తాయిదు అవసర సమయంలో చేతిని లేకుండా పోయింది" అంది విచారంగా.

"విన్ను వెతుక్కుంటూ వస్తూండగా ఆ తాయిదు నాకు దారిలో దొరకింది. ఇప్పుడు దాని సంగతేంగుకు ! ముందు, వీరి మధ్యనుండి బైట పడ్డానికి ప్రయత్నించు" అంటూ కత్తి చేతబట్టి శత్రువుల నెదుర్కొడానికి సిద్ధపడ్డాడు ప్రదీప్.

కిరణ్ ఉత్సాహానికి అంతులేకపోయింది. ఆమె అతనికి దగ్గరగా చేరి "ప్రదీప్! ముందు ఆ తాయిదు యిలా యియ్యి" అంది.

ప్రదీప్ తన వస్త్రాల్లో దాచిన తాయిదును యివతలికి తియ్యబోయేసరికి సైనికు లతని మీదకు విరుచుకు పడ్డారు. అది చూసి కిరణ్ కూడా కత్తిదూసి సైనికులతో పోరాటానికి సిద్ధపడింది. ఆమె అలా పోరాడుతూనే "ప్రదీప్! ముందు తాయిదు బైటకు తియ్యి. దాన్ని నాచేతి కివ్వగలిగితే మనమీ ఆపదనుండి తప్పించుకోగలం. సైనికులను నీ దరిదాపులకు

రానివ్వకుండా చేస్తాను! అవకాశం చిక్కగానే తాళిని నా కియ్యి" అంది.

రోషావేశాలతో పోరాడుతూన్న ప్రదీప్ ఆమె మాటల కేమీ సమాధాన మియ్యలేదు. కాని తీవ్రంగా పోరాడుతూ కూడా రెండవ చేత్తో తాళీని తియ్యడానికి తాపత్రయ పడసాగాడు.

కిరణ్ కూడా కట్టించిన పట్టాపిలతో పోరాడుతూ, ప్రదీప్‌ను చుట్టు ముట్టిన సైనికులను దూరంగా తరమడానికి ప్రయత్నించ నారంభించింది.

కాని, వందలాది సైనికుల ముందు కిరణ్ ప్రదీప్‌ల ప్రయత్నా లేమీ కొనసాగడంలేదు. ప్రదీప్‌కు తాళీని తియ్యడానికి తగిన అవకాశం లభించడంలేదు. శత్రువులను పూర్తిగా తరమగల శక్తి కిరణ్‌లో కనిపించడంలేదు.

క్షణ-క్షణానికి శత్రువుల సంఖ్య పెరిగిపోతూంది. కిరణ్‌లో ఆందోళన ఎక్కువవుతూంది. అది గమనించిన ప్రదీప్, "కిరణ్! ఆలస్యం చేస్తే లాభంలేదు. తాళీని తియ్యడానికి అవకాశం లభించడం లేదు. దాని విషయం తర్వాత చూసు కుందాం. ముందు సైనికుల్ని చీల్చి, నీకు దారిచేస్తాను— నువ్వు యిక్కడినుండి వెళ్ళిపో" అన్నాడు.

అతని మాటలు కిరణ్‌కు చాలా ఆవేశాన్ని కలిగించాయి. ఆమె విజృంభించి పోరాడుతూ "ప్రదీప్! నావల్ల భయ పడేంత పిరికిదాన్ని కాను. నేను బ్రతికి బైటపడ్డం కోసం శత్రువులకు నిన్ను అప్పగించలేను. ఈ ప్రయత్నాన్ని విడిచిపెట్ట కుండా పోరాడుదాం." అంది దృఢంగా.

ఆమె ధైర్యసాహసాలను ప్రదీప్ అంతకు ముందే తెలుసు కున్నాడు. ఇక, ఎంత చెప్పినా ఆమె ఉద్దేశం మారదని అతను గ్రహించాడు. ఏదో విధంగా తాళీని ఆమెకివ్వ డానికే నిశ్చయించుకున్నాడు.

ఒక స్థిర నిశ్చయానికి వచ్చిన ప్రదీప్ చేతి కదలికలో మార్పు వచ్చింది. అతను వీరవిహారం చెయ్యనారంభించాడు. అతని కత్తి ఒత్తిడిని తట్టుకోలేక శత్రుసైనికులు వెనుకంజ వెయ్యడం మొదలుపెట్టారు. అయినా వారు కూడా ప్రాణాలకు తెగించి పోరాడుతూ - ప్రదీప్‌కు వూపిరి పీల్చుకోడానికి కూడా అవకాశమివ్వడం లేదు.

ప్రదీప్ ఎంత తాపత్రయపడినా తాపీగును బైటకు తియ్యలేకపోతున్నాడు. అది అతనికి చాలా అవమానకరంగా తోచింది. సామాన్య సైనికులతో పోరాడుతూ తాపీగును తియ్యలేకపోవడం తన బలహీనతగా భావించాడు. అదే సమయంలో అతనొకసారి కిరణ్ వైపుకు చూశాడు.

శత్రుసైనికుల్ని చీల్చి చెండాడుతున్న కిరణ్ యుద్ధ నైపుణ్యాన్ని తిలకించి అతను ఆశ్చర్యపోయాడు. వెనుక ముందులు చూడకుండా ప్రవేశించే సైనికుణ్ణి కీలకాలు స్త్రీ ఆమె సాహసకృత్యానికి అబ్బురపడ్డాడు. అంతలోనే అతని ముఖం గంభీరంగా తయారయింది. ఖడ్గాన్ని ఆడలించి ప్రత్యర్థులకు విప్పి, కిరణ్ దగ్గరకు చేరుకున్నాడు. మరుక్షణంలోనే ఆమెతో కలసి సైనికుల్ని తునుమాడటం మొదలుపెట్టాడు.

కిరణ్ ప్రదీప్‌ల కత్తుల తాకిడికి శత్రువులు గడ-గడ లాడిపోయారు. ముందుకు వచ్చి పోరాడే సాహసం వారిలో తగ్గుముఖం పట్టింది. అది గమనించిన కిరణ్ మరీ వుత్సాహంగా పోరాడుతూ "ప్రదీప్! ఇంతకన్నా సావకాశం లభించను. తొందరగా తాపీగు తియ్యి" అంటూ, ఆమె ఖడ్గాన్ని ఆడలించి-శత్రువులను ప్రదీప్ దగ్గరకు చేరకుండా తరుమసాగింది.

ఒంటరిగా పోరాడుతున్న కిరణ్‌ను అంతం చెయ్యడానికి అంతకంటే మంచి అవకాశం దొరక దనుకున్న శత్రువులు ఒక్కసారిగా విజృంభించి ఆమెను చుట్టు ముట్టారు.

తనకు లభించిన అవకాశంలో తావీదును చేతిలోకి తీసుకున్న ప్రదీప్ ప్రక్కకు చూశాడు. కాని, అక్కడ కిరణ్ లేడు! .....ఆందోళనగా - సైనికుల మధ్యనుంచి చుట్టూ చూశాడు. ఒకచోట సైనికులు గుమిగూడి పోరాడు తున్నారు......ఆ దృశ్యాన్ని గమనించగానే, కిరణ్ వారి మధ్యలో వుందని వూహించాడు. గుర్రాన్ని అదలించి, అడ్డు వచ్చిన సైనికుల్ని అంతం చేస్తూ, శత్రువుల మధ్య యిరుక్కొన్న కిరణ్‌ను సమీపించి ఆమెకు అండగా నిలబడ్డాడు.

భయంకరమైన పోరాటం ప్రారంభమయింది. శత్రువుల సంఖ్య పెరిగిపోయింది. అప్పటికే కిరణ్ చాలా గాయపడింది. ప్రదీప్ కూడా అదే స్థితిలో వున్నాడు.

ఉద్రేకంగా పోరాడుతున్న కిరణ్ ప్రదీప్‌ను చూసింది. అతని గాయాలనుంచి స్రవిస్తున్న రక్తాన్ని తిలకించి "ప్రదీప్" అంది బేలగా.

ప్రదీప్‌కు ఆమె ఉద్రేకం అర్థమైంది. అతనామెకు దగ్గరగా చేరడానికి ప్రయత్నిస్తూ "కిరణ్! ఆశ్చర్యపడకు. నా తావీదు బైటకు తీశాను. నా దగ్గరకు రావడానికి ప్రయత్నించకు" అన్నాడు పోరాడుతూనే.

ఆమాట వినగానే కిరణ్ శరీరంలో నూతన శక్తి ప్రవేశించింది. ఎదురుగా నిలబడిన సైనికులను హతమార్చి ఒక్క దూకులో ఆమె తన గుర్రాన్ని ప్రదీప్ గుర్రం ప్రక్కను నిలిపింది.

సైనికులతో బాహాబాహీగా పోరాడుతూన్న ప్రదీప్ తన ఎడమ చేతిలో వున్న తావీదును కిరణ్ చేతికి అందిచ్చాడు. కిరణ్ ఆ తావీదును భక్తితో కళ్ళకద్దుకుని "యోగీంద్రా" అంది. అలా అంటూండగానే ఆమెకు మైకం క్రమ్ముతూన్నట్టు అనిపించింది.

  

ఆమె కంగారుగా తల విదలించి చుట్టూ చూసింది. తన ప్రక్కను ప్రదీప్ తప్ప మరెవ్వరూ లేరు. అంతవరకు తమతో పోరాడుతూన్న సైనికు లెవ్వరూ ఆ పరిసర ప్రాంతాల్లో కనుపించడంలేదు. వృద్ధయోగీంద్రుని వల్లనే ఆ ఆపద తప్పిందని తెలుసుకున్న కిరణ్ సంతోషంగా "ప్రదీప్! చూశావా, తావీదు మహిమ!" అంది.

తామున్న ప్రదేశాన్ని తిలకిస్తూన్న ప్రదీప్‌కి ఆమె అన్న మాటలు వినిపించలేదు. అతను నలువైపులా బాగా నిదానించి చూసి "కిరణ్! మన మింతవరకు పోరాడుతూన్న ప్రదేశం కాదిది! వందలకొద్దీ సైనికుల మధ్యనున్న మనం యిక్కడి కెలా వచ్చాం?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఈ తావీదు కారణంగానే మన గండం గడిచింది" అని తావీదును చేతికి కట్టుకుంటూ "ప్రదీప్! నీ గుర్రాన్ని ఆ ఉత్తర దిక్కుగా కనబడుతూన్న మార్గానికి మళ్లించు. నేనూ నీ వెనకాలే వస్తాను" అంది కిరణ్ చేతితో బాట వైపు చూపిస్తూ.

తావీదులోనున్న మహిమను తలచుకుంటూ ప్రదీప్-కిరణ్ చూపిన మార్గాన్ని అనుసరించాడు.

కొంతదూరం వెళ్ళేసరికి కిరణ్ కూడా తన గుర్రాన్ని ప్రదీప్ గుర్రం ప్రక్కకు చేర్చింది. రెండు గుర్రాలు సమాన వేగంలో ముందుకు పరుగెత్తసాగాయి.

బహిరంగ ప్రదేశంలో అతివేగంగా సాగుతున్న ఆ గుర్రాలు తక్కువ సమయంలోనే చాలా దూరం ప్రయాణం చేశాయి. నురగలు క్రక్కుతూ పరుగెడుతూన్న గుర్రాలను పరిశీలించి "కిరణ్! గుర్రాలు బాగా అలసిపోయాయి. కాస్త అలసట తీరేవరకు మనం ఎక్కడైనా ఆగడం మంచిది." అన్నాడు ప్రదీప్.

"అదిగో, ముందు ఏదో వూరు కనబడుతూంది. అక్కడకు వెళ్లి ఆగుదాం." అంది కిరణ్.

రాను రాను గమ్యం దగ్గరయ్యే కొద్దీ- అది నగరమని గుర్తించారు. అలసిన గుఱ్ఱాలను నెమ్మదిగా పరుగెత్తిస్తూ యిద్దరూ నగరంలో ప్రవేశించారు.

అక్కడి ప్రజలందరు చాలా విచారంగాను, దిగులుగాను వుండడం చూసి యిద్దరూ ఆశ్చర్యపోయ్యారు. తర్వాత ఒకరి ముఖాల్లోకి మరొకరు చూసుకుని, నెమ్మదిగా ముందుకు పోసాగారు. అంతలోనే దూరంగా కోలాహాలం వినిపించింది. క్రమంగా అది దగ్గరవుతూండడం గమనించి, యిద్దరూ కోలాహాలం వినవచ్చే వైపుకు తమ గుఱ్ఱాలను పోనిచ్చి, ఎదుట కనబడిన దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు.

ఆ దేశపు పట్టపుటేనుగు తొండాన్ని పైకెత్తి అడుగులో అడుగువేసుకొంటూ ముందుకు నడుస్తూంది. ఆ యేనుగు వెనక కొందరు సైనికులు వస్తున్నారు.

ఏనుగు తొండాన్నుండి అందమైన పూలమాల వ్రేలాడుతూంది. ఆ యేనుగు ఒకొక్కరిని పరిశీలించుకుంటూ ముందుకు వస్తూంది. కిరణ్ - ప్రదీప్‌లు తమ గుఱ్ఱాలను ప్రక్కగా నిలిపి ఆ దృశ్యాన్ని తిలకించసాగారు.

పట్టపుటేనుగు చూపు కిరణ్ - ప్రదీప్‌లమీద పడింది. అంతవరకు అడుగులో అడుగు వేసుకుంటూ అతి నెమ్మదిగా వస్తున్న యేనుగు కిరణ్ ప్రదీప్‌లను చూడగానే ఉత్సాహంగా ఘీంకరించి చురుగ్గా ముందుకు పరుగెత్తింది. అది తన తొండంతో పట్టుకున్న పూలమాలను కిరణ్ మెడలో వేసి, ఆమె ముందు మోకరిల్లింది.

సైనికులందరూ "వీరయువతికి జై" అంటూ నినాదాలు చేశారు.

పూర్తిగా మగవేషంలోనున్న తనను ఆ సైనికులు స్త్రీ అని

ఎలా గ్రహించాలో తెలియక క్షణకాలం కిరణ్ సంభ్రమాశ్చర్యాలకు గురయింది. ఆమె ప్రదీప్ ముఖంలోకి చూస్తూ "ప్రదీప్! ఇదంతా ఏమిటో నాకు తెలియకుండా వుంది. ఏమిటీ చిత్రం!" అంది నెమ్మదిగా.

ఆమె అలా అంటూండగానే సైనికుల్లోంచి అధికారి ముందుకు వచ్చి కిరణ్‌కి నమస్కరించి "అమ్మా, ఆలశ్యం చేయకండి తొందరగా ఏనుగు నధిష్ఠించి మహారాజా దర్శనం చేయండి." అన్నాడు.

ప్రదీప్ ఆ సైనికాధికారిని ఉద్దేశించి "యువకుడ్ని యువతిగా భావించి 'అమ్మా' అని ఎందుకు సంబోధిస్తున్నారు." అన్నాడు.

సైనికాధికారి ప్రదీప్‌ని చూస్తూ "అయ్యా! మా రాజ్యం మీదకు పరరాజులు దండెత్తి వచ్చారు. నగరానికి ఉత్తరంగా గుడారాలు వేసుకొని యుద్ధానికి సిద్ధంగా వున్నారు. వృద్ధాప్యంలో నున్న మా మహారాజు గారికి ఆ సంగతి తెలియడంతో చాలా ఆందోళన చెందారు. అయినా, ఆయన శత్రువును ఎదిరించడానికే నిశ్చయించుకొన్నారు. దేవాలయానికి వెళ్ళి తనకు విజయాన్ని చేకూర్చమని దైవాన్ని ప్రార్థించి తిరిగి వస్తుండగా వారి ఎదుట వృద్ధయోగి ప్రత్యక్షమై 'రాజా! దిగులుపడకు. ఈ రోజున మీ నగరంలోకి యిద్దరు యువతీ యువకులు ప్రవేశిస్తారు. యువతి కూడా పురుష వేషంలోనే వుంటుంది. వాళ్ళను తగిన విధంగా సత్కరిస్తే వాళ్ళే మీ సైన్యానికి నాయకత్వం వహించి నీకు విజయాన్ని చేకూరుస్తారు." అన్నాడు. అంతట మహారాజు వృద్ధయోగికి నమస్కరించి 'వాళ్ళను నేనెలా గుర్తించగలను మహానుభావా!' అన్నారు. వృద్ధయోగి క్షణకాలం ఆలోచించి "మహారాజా! అందుకో ఉపాయం చెపుతాను, అలా చెయ్యి. నీ పట్టపుటేనుగుకు మాల యిచ్చి నగరంలో విడిచిపెట్టు. ఏనుగు ఆ యువతీ

యువకులను గుర్తిస్తుంది. వారిలో ఒకరి కంఠాన్ని మాలతో అలంకరిస్తుంది. పురుషవేషంలో వున్నప్పటికీ మాలాలంకృతయైన వ్యక్తిని మీరు స్త్రీగా గుర్తించండి. ఆమె వల్లనే మీ బాధలు తొలగుతాయి.' అని వృద్ధయోగి అదృశ్యమైపోయాడు. ఆయన ఆనతిప్రకారం మహారాజా పట్టపుటేనుగును నగరంలో విడిచిపెట్టారు. ఫలితం మీరు చూస్తూనే వున్నారు. యథార్థాన్ని మరుగు పరచడానికి ప్రయత్నించకండి. మహారాజా ఆత్రుత చెందుతూ వుంటారు. దయచేసి మాతో కోటలోనికి రండి'' అన్నాడు.

దైవ నిర్ణయాన్ని వ్యతిరేకించడం అసాధ్యమనుకున్న కిరణ్ ప్రదీప్‌లు ఏనుగు నధిష్ఠించి కోట వైపుకు బయలుదేరారు.

  

పట్టపుటేనుగు మీద వస్తున్న కిరణ్-ప్రదీప్‌లను చూడగానే వృద్ధరాజదంపతులు సంతోషంగా ఎదురువచ్చి యిద్దరిని ప్రేమాదరాలతో అంతఃపురంలోనికి తీసుకు వెళ్లారు.

అంతఃపురంలోనున్న అపురూప వస్తుసముదాయాన్ని చూసి కిరణ్ ఆశ్చర్యపోయింది. కిరణ్‌కి స్వయంగా తన భవనమంతా దగ్గరుండి చూపిస్తున్న మహారాణి కీర్తిలత ఆమెను పూజామందిరం దగ్గరకు తీసుకు వెళ్లింది.

మందిరంలోంచి వస్తున్న కాంతి కిరణ్ కళ్ళను మిరుమిట్లు గొల్పింది. ఆమె కాసేపటికి ఆ కాంతికి అలవాటుపడి మందిరం లోపలకు నిదానించి చూసింది. ఎదురుగా గోడకు చేర్చి బంగారు మండపం అమర్చివుంది. మండపంలోనున్న రత్న సింహాసనంమీద తళతళ్ళాడుతూన్న తామరపద్మం కనుల కింపుగా కనబడుతూంది. ఆ పద్మంలోంచి వస్తున్న కాంతి రేఖలతో ఆ మందిరమంతా దేదీప్యమానంగా వెలిగిపోతూంది. కిరణ్ ఆసక్తిగా చాలాసేపు ఆ పద్మాన్నే చూస్తూ వుండి

పోయింది. అది గమనించిన మహారాణి 'అమ్మా! ఆపద్మాన్ని ఎంతకాలం చూసినా తృప్తి కలుగదు. నాకు వివాహమై ఇక్కడకు వచ్చినప్పటినుంచి, నిత్యమూ యీ పద్మాన్ని ఆరాధిస్తున్నాను. ఒక్కొక్కప్పుడు యీ పద్మంలో ఎంతో మార్పు కనబడుతూంది. రకరకాల రంగులు కనబడతాయి. అది నా భ్రమో యథార్థమో తెలియదు. కాని పంటలు అధికంగా పండి, దేశం సుభిక్షంగా వున్నప్పుడు యీ పద్మం నా కంటికి పచ్చగా కనబడుతూంది. దేశంలో ఎలాంటి విపరీతాలు జరగకుండా, ప్రజలందరూ సుఖసౌఖ్యాలతో కాలం గడుపుతూంటే యీ పద్మం నుండి పసుపు పచ్చని కాంతులు ప్రసరిస్తాయి. అంతే కాదు, యీ పద్మం అరుణకాంతులను విరజిమ్మినప్పుడు దేశం రక్తపాతానికి గురవుతుంది. యీ విచిత్రపద్మంలోవున్న విశేషమేమిటో నా కింతవరకు తెలియదు. మహారాజుకు కూడా అగమ్యంగానే వుంది. అయితే కొన్ని తరాలనుండి ఆ పద్మాన్ని ఆరాధించడం ఆచారంగా వస్తూంది. ఈ పద్మం కోసమే తేజోనగరాన్ని పాలిస్తూన్న విక్రమసేనుడు యిప్పుడు మా దేశం మీదకు దండెత్తివచ్చాడు. మేము వృద్ధులమైనాము. మాలో పోరాడే శక్తిలేదు. అంత మాత్రంచేత భయపడి యీ విచిత్ర పద్మాన్ని విక్రమసేనునికి అర్పించే తలంపు మాకు లేదు. దీని కోసం మా ప్రాణాలను అర్పించడానికే నిశ్చయించుకున్నాం. దైవ నిర్ణయం ఎలా వుందో తెలియడం లేదు" అందామె కన్నీరు జలజలరాలుతూండగా.

శోకదేవతలా దుఃఖిస్తూన్న మహారాణి ముఖంలో కిరణ్‌కు మాతృభావం కనబడసాగింది. ఆమె కళ్లు కూడా చెమ్మగిల్లాయి. "మహారాణీ! దిగులుపడకండి. అన్నిటికీ ఆ దేవుడే వున్నాడు" అంటూ కిరణ్ మహారాణిని ఓదార్చింది.

తర్వాత ఇద్దరూ మహారాజు వున్న ప్రదేశానికి తిరిగి వచ్చారు.

అప్పటికి మహారాజు తన ప్రక్కను కూర్చుని శ్రద్ధగా వింటూన్న ప్రదీప్‌తో విచిత్ర వస్త్రానికి సంబంధించిన విశేషాలను చెప్పి "చూశావా, ప్రదీప్! ఇదీ విషయం. అయితే ఆ వస్త్రం మా వంశీకులకు ఎలా ప్రాప్తించిందో, దాన్ని ఎందుకు అంత భద్రంగా దాచారో నాకు తెలియదు. కాని, ఆచారాన్ని విడిచిపెట్టకుండా పూజిస్తూనే వున్నాం... దైవంతో సమానంగా భావించి, భక్తిశ్రద్ధలతో పూజిస్తూన్న ఆ వస్త్రాన్ని తన వశం చేయమని విక్రమసేనుడు కబురు పంపాడు. అందుకు నేను ఒప్పుకోనందున, సేనతో వచ్చి నగరానికి సమీపంలో గుడారాలు వేశాడు. ఏ క్షణంలో యుద్ధం ప్రారంభమౌతుందో తెలియకుండా వున్నాను." అంటూండగా ద్వారపాలకుడు అక్కడకు వచ్చి సత్యదేవునకు నమస్కరించి "మహారాజా! విక్రమసేన మహారాజుగారి రాయబారులు తమ దర్శనాన్ని కోరుతున్నారు." అన్నాడు వినయంగా.

మహారాజు కాసేపాలోచించి "దర్బారులో ప్రవేశపెట్టు" అనగానే సైనికుడు అక్కడనుండి వెళ్ళిపోయాడు.

తర్వాత, మహారాజు-కిరణ్, ప్రదీప్‌లను వెంటబెట్టుకొని అంతఃపురాన్నుండి దర్బారుకు బయలుదేరాడు.

## 18

సత్యదేవ మహారాజు సింహాసనాన్ని అధిష్టించగానే సభాసదులందరు తమ ఆసనాల నలంకరించారు. కిరణ్-ప్రదీప్‌లు మహారాజుకు యిరువైపులా కూర్చున్నారు.

దర్బారులో వున్న వాళ్ళందరూ సంభ్రమాశ్చర్యాలతో

కిరణ్-ప్రదీప్‌లను తిలకిస్తూండగా, సైనికులు - విక్రమసేనుని రాయబారులను సభలో ప్రవేశపెట్టారు.

రాయబారులు మహారాజుకు నమస్కరించి వార్తాపత్రాన్ని వినయంగా ఆయనకు అందజేశారు. మహారాజు ఆదరంగా ఆ పత్రాన్ని అందుకుని మంత్రి చేతికి యిచ్చాడు.

మంత్రి శాంతికాముడు పత్రాన్ని విప్పి, పైనుండి క్రింది వరకు ఓ మారు చూసి, తర్వాత, అందరికు వినబడేలా చదివాడు. అందులో ఇలా వుంది—

పూజనీయులు సత్యదేవ మహారాజుగారికి విక్రమసేన మహారాజు భక్తితో నమస్కరించి వ్రాయునది-మన రెండు దేశాల మధ్య యింతవరకు ఎన్నడు విరోధభావం లేదు. ఇక ముందు కూడా వుండదని భావిస్తున్నాను. అయితే నాతోపాటు మీరు కూడా అట్టి వుద్దేశం వున్నప్పుడే అది సాధ్యపడుతుంది. కాని, మీ తలంపులు అందుకు భిన్నంగావున్నట్టు మా గూఢచారుల వల్ల తెలుసుకున్నాను. వృద్ధులైన మీరు పోరాటానికి తలపడ్డం మంచిది కాదు. ఊరు, పేరు లేని వాళ్లు మీకు ఉపకారం చేస్తారనుకోవడం పొరపాటు. మీ సైనిక బలం, అశ్వికదళం నన్నేమీ చేయలేనపుడు ఎవరో యువతీ యువకులు యిద్దరు నన్ను పరాజితుడ్ని చేయగలరనే నమ్మకాన్ని విడిచిపెట్టండి. అభిప్రాయాన్ని మార్చుకొని ప్రాణాలను కాపాడుకొండి. మన దేశాల మధ్య నున్న మిత్రత్వాన్ని స్థిరపరచండి. విచిత్రపద్మాన్ని నావశం చేస్తే వెంటనే నా దేశానికి వెళ్లిపోతాను. పద్మంయొక్క ప్రభావం విన్న తర్వాత, దాని గుణాలు తెలుసుకొని, అది నా దగ్గర వుండడం మంచిదిగా భావించాను. వృద్ధులైన మీ రిక

దాని రక్షణ బాధ్యతను నిర్వహించలేరని గుర్తించి ఆ బరువును నేనే మోయదలచాను. సుహృద్భావంతో దాన్ని నాకు అందచేయండి. అంతటితో మన రెండు దేశాలు ఏకదేశంగా నిలుస్తాయి.

ఇట్లు,

మహారాజు విక్రమసేనుడు.

ఉత్తరాన్ని చదవడం ముగించి మంత్రి శాంతికాముడు మహారాజా ముఖంలోకి చూశాడు. అది గమనించిన మహారాజా సైన్యాధిపతి వైపు తల త్రిప్పాడు.

"మహారాజా! విచిత్ర పద్మాన్ని తమ ప్రాణంకంటె ఎక్కువగా చూసుకుంటున్నారని నాకు తెలుసు. ప్రసువు కొరకు ప్రాణా అర్పించడానికి ప్రజలంతా సిద్ధంగా వున్నారు. రాయబారులకు తగిన సమాధానం చెప్పి పంపించండి" అన్నాడు సేనాధిపతి వినయంగా.

"సైన్యాధిపతి యదార్థం చెప్పారు మహారాజా! ఆయన నిర్ణయాన్ని మన్నించండి" అన్నారు దర్బారులో వున్న వాళ్లందరూ.

మహారాజా యందు ప్రజలకున్న భక్తిగౌరవాలను తిలకించిన కిరణ్, ప్రదీప్‌లు చాలా ఆనందించారు. కాని. అంతలోనే యిద్దరూ కొంచెం ముందుకువంగి ఒకరినొకరు చూసుకొన్నారు. కళ్లతో ఏదో మాట్లాడుకున్నారు తిరిగి యధాప్రకారం సింహాసనానికి జారబడ్డారు.

మహారాజా వాళ్ళ ప్రవర్తనను అంతగా పట్టించుకోలేదు. కాని, యిద్దరినీ ఒకసారి నిదానించి చూసి "ఈ పత్రంగురించి మీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు.

"సర్వం తెలిసిన మీకు మేము చెప్పవలసిం దేముంటుంది మహారాజా! సుహృద్భావంతో మెలగాలంటూనే సమరానికి

సిద్ధంగా వున్నాడు విక్రమసేనమహారాజా. సైన్యాధిపతి చెప్పి నట్టు తగిన సమాధానం యోచించండి మహారాజా!" అన్నాడు ప్రదీప్.

కిరణ్ ఆవేశంగా లేచినిలబడింది. "మన్నించండి మహారాజా! సాహసానికి క్షమార్పణ కోరుకున్నాను." అని రాయబారులవైపు తీక్షణంగా చూస్తూ "విచిత్ర పద్మాన్ని మీ మహారాజుకు అర్పిస్తే ఒక గొప్ప యుద్ధ ప్రమాదం తప్పుతుంది గదా." అంది.

కిరణ్ అభిప్రాయాన్ని అర్థం చేసుకోలేక అందరూ ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూస్తూ వుండిపోయారు.

"అవును. దేశక్షేమాన్ని ఆలోచించి అలా చేయడం చాలా మంచిది. ప్రజలు ఎలాంటి కష్టనష్టాలకు గురికాకుండా సుఖంగా బ్రతుకుతారు" అన్నాడు రాయబారుల్లో ఒకడు.

"రాయబారి! అలాంటి నీతులు మాకు తెలుసు. ఆ విషయంలో మీ సలహాలు మాకక్కర్లేదు. నేనడిగిన మాటకు సమాధానం చెప్పు. పద్మం లభిస్తే మీ మహారాజు యుద్ధం చెయ్యడు కదా." అంది కిరణ్ సూటిగా రాయబారి కళ్ళల్లోకి చూస్తూ.

"అవును." అన్నాడు రాయబారి దృఢంగా.

"ఒకవేళ మా మహారాజు పద్మాన్ని అర్పించడానికి అంగీక రించకపోతే—"

"యుద్ధం తప్పదు."

రాయబారి నోటినుండి ఆమాట రాగానే దర్బారంతా కత్తుల కరకర ధ్వనులతో నిండిపోయింది.

కాని, కిరణ్ నిశ్చలమైన దృఢకంఠంతో "రాయబారి! మీ మహారాజు విచిత్ర పద్మాన్ని ఎప్పుడైనా చూశారా" అంది.

"లేదు." అన్నాడు రాయబారి కుపితుడై.

దర్బారులో వున్న వాళ్ళందరూ ఆ యిద్దరికి సంభాషణా

కుతూహలంగా వింటున్నారు. మహారాజా కూడా ఏమీ మాట్లాడకుండా ఒకసారి రాయబారులను మరొకసారి కిరణ్‌ను చూస్తున్నాడు.

ఆ సమయంలో ప్రదీప్ సింహాసనం మీదనుంచి లేచి నెమ్మదిగా దర్బారులోకి ప్రవేశించే సింహద్వారం వైపు నడవసాగాడు. ఆ విషయాన్ని ఎవరూ గమనించలేదు. కిరణ్ ఏమి చెప్తుందో వినాలనే ఉద్వేగంతో అందరూ ఆమె ముఖంలోకే చూడసాగారు.

"రాయబారీ!!" అంది కిరణ్.

కంచులా మ్రోగిన ఆమె కంఠస్వరానికి అందరి హృదయాలు ఒక్కసారి దడదడలాడాయి. మహారాజా కూడా ఆశ్చర్యంతో ఆమె ముఖంలోకి [illegible] చూశాడు.

కిరణ్ [illegible] గమనించింది. "రాయబారీ! [illegible] ఘడియల్లో మా మహారాజును [illegible] భాగ్యం తప్పక లభిస్తుందని చెప్పారే" అని.

రాయబారి తన సహచరుని వైపు చూశాడు. ఆ తర్వాత తిరిగి కిరణ్ ముఖంలోకి నిర్భయంగా చూస్తూ "మేము మహారాజా అభిప్రాయం కోసం ఎదురు చూస్తున్నాం" అన్నాడు.

రాయబారి అలా అనగానే మహారాజా ఏదో అనబోయాడు. కాని, కిరణ్ ఆయనకా అవకాశాన్నివ్వకుండా "రాయబారీ! నేనింతవరకు మహారాజా [illegible] మాట్లాడుతున్నాను. వారు మీకు చెప్పవలసిన సమాధానం ఏమీ లేదు. అన్యాయాన్నీ, అక్రమాన్నీ సహించేవాళ్లు యిక్కడ ఎవరూ లేరు. దౌర్జన్యానికి తలవొంచే అలవాటు మాకు లేదు. తనది కాని వస్తువుకోసం తాపత్రయపడే మీ మహారాజా అవివేకానికి విచారిస్తున్నాను. శక్తివుంటే యుద్ధం చేయమను. ఎవరు జయిస్తారో తెలుస్తుంది. అంతేకాని, పత్రాల ద్వారా

ప్రగల్భ వాక్యాలు పలకడం వీరలక్షణం కాదని మహారాజుకు తెలియజెయ్యి" అంది కిరణ్.

కిరణ్ అన్నమాటలకు దర్బారులో కలకలం బయలు దేరింది. కిరణ్‌ను అందరు అన్నివిధాలుగా పొగడ్డం ప్రారంభించారు. మహారాజు ఆనందంగా ఆమెను వీక్షించసాగాడు.

అంతలో "చేతులు కదిపితే కత్తులు వీపులో దిగబడి పోతాయి" అన్నమాట దర్బారులో ప్రతిధ్వనించింది. ఆ మాట రాయబారులకు సమీపంలో వినబడ్డంవల్ల అందరూ అటు చూశారు.

ప్రదీప్ తన రెండు చేతుల్లోనూ వున్న కత్తులను రాయబారుల వీపుల్లో గుచ్చి వుంచాడు. ఆ దృశ్యాన్ని తిలకించి ప్రదీపే ఆ మాట అన్నాడని గ్రహించి దర్బారులోని వారంతా ఆనుమానాశ్చర్యాలకు గురయ్యారు.

అంతేకాదు. ప్రాణ్ణడే నిలబడిపోయిన రాయబారుల్లో ఒకడు నెమ్మదిగా చేతిని వస్త్రాల్లోకి జొనపబోతూండడాన్ని గమనించిన ప్రదీప్ అతని శరీరంలోకి గుచ్చివుంచిన కత్తిని రెండుసార్లు అటూ-ఇటూ త్రిప్పి "జాగ్రత్త అధిక తెలివి నుపయోగిస్తే కత్తి గుండెలవరకు చొచ్చుకుపోతుంది" అని సైనికుల నుద్దేశించి "వీళ్ళ చేతులను కాసేపు విరచి కట్టండి. వస్త్రాల్లోవున్న వస్తువుల్ని నెమ్మదిగా బయటకు తీయండి" అన్నాడు.

రాయబారులు భయాందోళనలతో కంపించిపోతూండగా సైనికులు వాళ్ళను బంధించి వస్త్రాలను శోధించి, రెండు గుండ్రని వస్తువులను బయటకు తీశారు.

ప్రదీప్ ఆ వస్తువులను చేతబట్టుకుని, వాటిని పరీక్షించి చూస్తూ, సింహాసనం దగ్గరకు చేరాడు.

కిరణ్ ఆ వస్తువులను తన చేతిలోకి తీసుకొని రాయబారుల

వైపు చూసింది. ఒణికిపోతూన్న రాయబారులు ఆమె చూపులోని తీక్ష్ణతను తట్టుకోలేక తలలు దించుకున్నారు.

కిరణ్ రాయబారుల నుద్దేశించి "మీరు రాయబారులా, గూఢచారులా?" అంది అధికారాన్ని వ్యక్తపరుస్తూ.

"గూఢచారులం కాము, రాయబారులమే" అన్నారు యిద్దరూ ఒకేసారి వినయంగా.

"రాయబారులకు మారణ వస్తువుల అవసరం ఎందుకు వుంటుంది?"

ఆమె ప్రశ్నకు మంత్రి శాంతికాముడు అదిరిపడ్డాడు. "కుమారీ! నీ చేతిలో నున్నవి మారణవస్తువులా!" అన్నాడు ఆందోళనగా.

"ఔనండి వీళ్ల హావభావాలు చూసి ముందే అనుమానించాను. ప్రదీప్ కూడా నాకంటే ముందు తెలుసుకున్నాడు. వీళ్ల చూపుల్లో, మాటల్లో నాకంతా 'విద్రోహభావమే' కనబడింది. వాళ్లు తెచ్చిన పత్రానికి అనుకూలమైన సమాధానం రాకపోతే మహారాజును అంతంచేసే తలంపుతోనే యీ మారణ వస్తువుల్ని వెంట తీసుకువచ్చారు. కాని, ప్రదీప్ ముందే జాగ్రత్తపడి వారి ఆటలు సాగనీయలేదు. మోసంతో ప్రభువును అంతంచేసి, రాజులేని రాజ్యాన్ని తేలిగ్గా వశపరచుకోవచ్చు అనుకున్నాడు విక్రమసేనుడు. అతని కుటిలత్వం యిందులోనే వెల్లడయింది" అని మహారాజు వైపు చూసి "మహారాజా! ఈ నీచులకు తగిన దండన విధించండి" అంది క్రోధంగా.

అప్పుడే సింహాసనంమీద కూర్చుంటూన్న ప్రదీప్ ఆమె అన్న చివరివాక్యం విని-'కిరణ్" అంటూ ఆవేశంగా లేచి నిలబడ్డాడు. మహారాజుతో సహా అందరూ అతని వైపు

ఆశ్చర్యంగా చూశారు. కిరణ్ కూడా సంభ్రమాశ్చర్యాలతో అతని ముఖంలోకి చూడసాగింది.

ప్రదీప్ తనకు కలిగిన ఆవేశాన్ని అణచుకుంటూ "మన్నించండి మహారాజా! అన్యాయాన్ని సహించలేక ఆవేశపడ్డాను. సభాగౌరవానికి భంగం కలిగించినందుకు క్షమించమని ప్రార్థిస్తున్నాను... న్యాయం - న్యాయం అంటూనే కిరణ్ అన్యాయానికి తలపడుతూంది. రాకుమారులకు దండన విధించమని మిమ్మల్ని ప్రేరేపిస్తోంది. అపరాధం కాదు. వాళ్లకు దండన విధించటం తప్పవుతుంది. ఆలోచించండి. మహారాజా!" అన్నాడు నెమ్మదిగా.

అతనలా అనడానికి గల కారణాన్ని ఎవ్వరూ ఊహించలేకపోయారు. కిరణ్‌కి కూడా అతని మాటల్లోని భావం అర్థంకాక ఆలోచిస్తూ వుండిపోయింది. మహారాజు మౌనంగా మంత్రి ముఖంలోకి చూశాడు.

"నేరంచేసిన వాళ్లను దండించటంలో తప్పేముంది!" అన్నాడు మంత్రి శాంతిగా నవ్వుతూ-సాలోచనగా.

"మంత్రిగారు! అపరాధులను శిక్షించవద్దని నేను చెప్పడం లేదు. అపరాధానికి మూలకారణాన్ని గ్రహించమని మనవి చేస్తున్నాను... ప్రభువు ఆజ్ఞకు భటులు ఎప్పుడూ బద్ధులై వుండాలి. ప్రభువు కోసం తమ ప్రాణాలర్పించడానికి సిద్ధంగా వుండాలి. అట్టివాళ్లే నిజమైన సేవకులుగా గుర్తించబడతారు. వాళ్ళ యొక్క హోదాలు, అధికారాలు విడిచి పెడితే-మంత్రి దగ్గర నుండి సైనికుని వరకు అందరూ మహారాజుకు సేవకులే. వారిలో మహారాజు ఆనతిని మీరిన వాళ్ళందరూ స్వామి ద్రోహులే అవుతారు." అని మహారాజును చూసి "ఏమంటారు, మహారాజా" అన్నాడు ప్రదీప్.

ప్రదీప్ మాటల్లో వున్న నిగూఢాన్ని తెలుసుకోలేక

వాళ్ళందరూ అతని విమర్శనా జ్ఞానానికి ఆశ్చర్యపోయారు. మహారాజా సత్యదేవుడు ఆనందంగా అతన్ని తన కౌగిలిలో యిముడ్చుకున్నాడు. మంత్రి శాంతికాముడు ప్రదీప్ తెలివికి ఎక్కువగా మెచ్చుకున్నాడు. దర్బారులో నేరస్తులుగా నిలబడి వున్న రాయబారులు ప్రదీప్ ముఖంలోకి కృతజ్ఞతా పూర్వకంగా చూస్తుండగా, కిరణ్ అందరి చేతా మెప్పును పొందుతూన్న ప్రదీప్ చాకచక్యానికి లోలోపల సంతోషిస్తూ, తన తొందరపాటుకు సిగ్గుపడి, తల వంచుకొని, క్రీగంటితో అతని కళ్ళల్లోకి చూడసాగింది.

అంతవరకు ఏర్పడిన నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "ప్రదీప్! నీ విచక్షణా జ్ఞానానికి సంతోషిస్తున్నాను. యీ రాయబారుల విషయంలో నీ వుద్దేశమేమిటో తెలియజెయ్యి. నీ అభిప్రాయాన్ని తప్పకుండా మన్నిస్తాను." అన్నాడు మహారాజా.

ప్రదీప్ తలవంచి కృతజ్ఞతను తెలియపరచి "మహారాజా! అన్యాయాన్ని న్యాయంగా ఎదుర్కోవాలనీ, అధర్మాన్ని ధర్మంతో జయించి తీరుగుందనీ శాస్త్రాలు చెపుతున్నాయి. యీ రాయబారులను మన్నించి విడిచి పెడుతూ, రేపు వేకువజాము నే యుద్ధానికి సిద్ధంగా వుండమని వీళ్ళ ద్వారా నే విక్రమసేన మహారాజుకు వార్తను పంపండి." అన్నాడు వినయంగా.

మహారాజా రాయబారులను చూసి "మీ అపరాధాన్ని క్షమించాను. విచిత్ర పద్మం ఎలాంటి పరిస్థితిలోను మీ మహారాజుకు సంక్రమించదని చెప్పండి. తెల్లవారే టప్పటికి సేనలన్నింటితోను మా సరిహద్దును దాటి వెళ్ళకపోతే యుద్ధం తప్పదని తెలియజెయ్యండి." అని కిరణ్ ప్రదీప్‌లు వెంట వస్తూండగా, మంత్రి సామంతులతో కలిసి ఆలోచనా మందిరం వైపు బయలుదేరాడు.

# 39

సూర్యోదయమౌతూండగానే యిరుసేనలకు యుద్ధం ప్రారంభమైంది. రణభూమి రక్తసిక్తమై పోతూంది. సర్వసైన్యాధ్యక్షత్వం వహించిన ప్రదీప్ ఎక్కడ చూసినా తానే కనబడుతూ సైనికులను ఉత్తేజపరుస్తున్నాడు.

ప్రదీప్ నాయకత్వం సంతోషభరితం సైనికులకు అమితోత్సాహాన్ని కలిగించింది. ప్రభుభక్తి పరాయణులైన సైనికులు ప్రాణాలను లెక్క చేయకుండా విక్రమసేనుని సైన్యాన్ని చీల్చి చెండాడటం మొదలుపెట్టారు.

ఏనుగును అధిష్టించి యుద్ధభూమిలోకి ప్రవేశించిన విక్రమసేన మహారాజు తన సైన్యాన్ని ఉద్రేకపరుస్తూ ప్రదీప్‌తో పోరాటానికి తలపడ్డాడు. ఆ యిరువురి వీరోచిత పోరాటాన్ని తిలకించిన యోధులు తమ తమ శక్తి సమర్థతలను ప్రదర్శించుకుంటూ అతి భయానకంగా పోరాడసాగాయి.

వీరోచితమైన దుస్తులను ధరించిన కిరణ్ మహారాణి పూజా మందిరం దగ్గరకు వెళ్ళి విచిత్ర పద్మానికి నమస్కరించింది. అక్కడనుండి ఆమె తిరిగి రాబోతూ పద్మంలో వస్తున్న మార్పును గుర్తించి దాని వైపు నిదానించి చూసింది. అంతలోనే విచిత్ర పద్మం రక్తకాంతులను వెదజల్ల సాగింది. ఆ మార్పును గమనించిన కిరణ్‌కు మహారాణి అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి. యుద్ధం ప్రారంభమైందని, రక్తపాతం జరుగుతూందని. ఆమె వెంటనే గుర్తించింది. తొందరగా బయటకు వచ్చి కొన్ని పిడిబాకులను వరుసగా ఒరలలో యిముడ్చుకుని, ఖడ్గాన్ని చేతబట్టి రాజదంపతులకు భక్తితో నమస్కరించింది. వారి ఆశీస్సులను పొందిన కిరణ్ వెంటనే, తన కోసం వేచివున్న శ్వేతాశ్వం మీద ఎగిరి కూర్చుంది. ఎన్ని విధాల అభ్యంతర పరచినా వినకుండా సత్యదేవ మహారాజు కూడా ఆమె ననుసరించాడు.

యుద్ధభూమిలో నేలకొరిగిన సైనికులను, ధారగా పారుతూన్న రక్తాన్ని చూడగానే వశంతప్పిన ఆవేశంతో శత్రు సైన్యాన్ని తాకింది కిరణ్.

స్వైరవిహారం చేస్తున్న కిరణ్ కత్తికి పశువులు, వందలుగా బలి అయిపోతున్నారు శత్రుసైనికులు. ఆమెకు ఎదురు నిలచి పోరాడే శక్తి వారిలో ఒక్కరికీ లేకపోయింది. అడ్డూ ఆటంకం లేకుండా శత్రువులను చీల్చుకుంటూ పోయి తన గుర్రాన్ని విక్రమసేనుని ఏనుగు ముందు నిలపింది కిరణ్.

అంతవరకూ ప్రదీప్‌తో పోరాడుతూన్న విక్రమసేనుని దృష్టి కిరణ్ మీద పడింది. [illegible] కొంతకాలం రెప్ప వాల్చకుండా చూశాడు. ఆమెలోని [illegible] గుడ్డి చేసింది. ఆమె సౌందర్యానికి అతను ముగ్ధుడైనాడు. ఆ ఒక్క క్షణం అతను యుద్ధాన్ని మరచిపోయాడు. ఆ సమయంలో అంగరక్షకులు కాపాడకపోతే ! కిరణ్ కత్తి దెబ్బలకు అతని శిరస్సు శరీరాన్నుండి వేరైపోయ్యుండేది.

విక్రమసేనుని చూపుల్లోని ఆకలిని కిరణ్ గ్రహించింది. అందుకు సమాధానంగా తన పొదిలోంచి ఒక బాణం తీసి అతనిమీదకు విసరింది. ఆమె విసరిన బాణం విక్రమసేనుని వక్షం మీదున్న కవచాన్ని తాకి క్రింద పడిపోయింది.

ఆ బాణం తాకిడితో విక్రమసేనుడు వూహాప్రపంచాన్నుండి తేరుకున్నాడు. అతను క్రిందపడిన బాణంను చూసి పకపకా నవ్వాడు. ఆ నవ్వులోవున్న భావాన్ని గ్రహించిన కిరణ్ ఉగ్రరూపాన్ని దాల్చి "రాజా! ఆ బాణంతో నిన్ను హెచ్చరించాను. అయితే, అంతమాత్రంచేత నా చేతుల్లో సత్తువలేదనిగాని, నువ్వు ధరించిన కవచం అభేద్యం అనిగాని అనుకోకు. అన్యాయానికి, అక్రమానికి తగిన ఫలితాన్ని యిప్పుడే అనుభవిస్తావు" అంటూ తన గుఱ్ఱాన్ని ఏనుగుమీదకు

మహారాజుల మీదకు మళ్లించింది. పట్టపుటేనుగు-విక్రమసేనుని ఏనుగు దంతాల మధ్య యిరుక్కున్న తన తొండాన్ని విడిపించుకోడానికి తాపత్రయ పడుతూండగా, విక్రమసేనుడు బల్లాన్ని పైకెత్తి, సత్యదేవుని వధానికి గురిపెట్టి విసరడానికి సిద్ధపడుతున్నాడు. ఆ దృశ్యాన్ని చూసి కిరణ్ కంపించిపోయింది. వెంటనే గుఱ్ఱానికి రికాబులను తాకించి అటు దూకించింది. అలా చేస్తూనే ఆమె బాకును దూసి విక్రమసేనుని మీదకు విసిరింది.

గురి తప్పని ఆ బాకు విక్రమసేనుని భుజంలో దిగబడింది. అతని చేతిలోని బల్లెం క్రిందకు వాలిపోయింది. అంతలోనే అక్కడకు చేరిన కిరణ్ తన కత్తితో ఏనుగు పాదాన్ని శక్తికొద్దీ నరికింది. విక్రమసేనుని ఏనుగు ఆ బాధకు తాళలేక ఘీపెడుతూ పట్టపుటేనుగు తొండాన్ని విడిచిపెట్టింది. కాని, మరుక్షణంలోనే అది తన తొండంతో కిరణ్‌ని బలంగా చుట్టిపట్టుకొని నేలమీదకు విసిరి కొట్టాలనే తలంపుతో పైకెత్తింది. తొండంలో చిక్కుకున్న కిరణ్‌కు శ్వాస పీల్చుకోడానికి సావకాశం లేకపోయింది. చేతిని కదపి తాపీను తాకడానికి వీలు చిక్కింది కాదు. అంతటితో ప్రాణాలమీద ఆశ విడచిపెట్టుకున్న కిరణ్-జయశ్రీని తలుచుకుంటూ, చివరిసారిగా ప్రదీప్‌ను చూడాలనే తలంపుతో చుట్టూ పరికించ సాగింది!

# 40

విరానభామిని శత్రువులవల్ల బంధించబడి, నీటి అడుక్కి దిగబడిపోతూన్న కుంభరాక్షసుడ్ని-యుద్ధరంగంనుండి పారిపోతూన్న అతని అస్థిభూతం చూసి, బంధవిముక్తుడ్ని చేసి మందిరానికి చేర్చింది.

సర్వశక్తులు నాశనమైపోగా, మిగిలిన అస్థిభూతం సహాయంతో అతను తన ఆరాధ్యదేవత-వనదుర్గ ఆలయంలో ప్రవే

శించాడు. గాయాలనుండి స్రవిస్తూన్న రక్తంతో దుర్గను అభిషేకించి, ఆమె ముందు మోకరిల్లాడు. మనస్సును దుర్గయందు లగ్నం చేసి "దేవీ! నా కాళీ! సంవత్సరాలనుండి తపస్సుచేసి నీ వల్ల పొందిన శక్తులన్నిటినీ నాశనం చేసుకున్నాను. నిస్పృహుడనై నీ ముందు మోకరిల్లాను. నన్ను కరుణించు. నాకు కావలసిన శక్తులను ప్రసాదించు. మీనభామినిని జయించే బలాన్ని సమకూర్చు. నా దేవీ! కాళీరమ్మా! లోకాన్ని ఉద్ధరించడానికి అవతరించావు. పూజించిన భక్తుల కోరికలు తీర్చడానికి కంకణం కట్టుకున్నావు. నిన్ను ఆరాధించే భక్తుల్లో నేనొకడ్ని. నీ రూపాన్ని నా హృదయ ఫలకంమీద చిత్రించుకొని, నిత్యం నీ నామాన్ని జపించుకుంటున్నాను. నీ కరుణాపూరిత దృష్టిని నా మీద ప్రసరింపచెయ్యి. ప్రత్యర్థుల బలానికి లొంగని శక్తిని నాకు కలిగించు. ఓటమి ఎరుగని నన్ను మీనభామిని మందొకసారి అవమానించింది. తిరిగి, నేడు ప్రాణాపాయానికి గురి చేసింది. ఆనాడు జయజీవనిని నాకు కాకుండా చేసింది. ఈ నాడు జయశ్రీని నాకు దూరం చేసింది. ఆమెయందున్న ప్రతీకార వాంఛతో నా గుండెలు మండిపోతున్నాయి. దేవీ! కరుణించి సాక్షాత్కరించు. చెయెత్తి ఆశీర్వదించు. నీ భక్తుడ్ని, శ్రద్ధాభక్తులతో ప్రార్థిస్తున్నాను" అంటూండగా "కుంభా" అన్న శబ్దంతో ఆలయమంతా మారుమ్రోగింది.

కుంభరాక్షసుడు వుత్సాహంగా లేచి నిలబడి "దేవీ! నా మీద జాలి కలిగిందా! ఈ దీనుని మొర నీకు వినబడిందా! తల్లిని చూపు చూడు కాళీ! నీకు కట్టాలిస్తాను. కానుకలు చెల్లిస్తాను. మానవరక్తంతో నీ జిహ్వను తడుపుతాను. దేవీ! మీనభామినిని ఓడించే శక్తిని కలిగించు. జయజీవని దక్కకపోయినా, జయశ్రీ అయినా నాకు లభించేలా

